# పరిచయం

నాజీ దురాక్రమణదారులను హతంగావిస్తూ సోవియట్ భూమినుంచి బయటికి తరుముతున్న రెడ్ ఆర్మీ పోలెండులో ప్రవేశించిన రోజునే, పోలెండుస్వాతంత్ర్యసమస్య ముందుకువచ్చింది. రెడ్ ఆర్మీ విజయపరంపర లతోపాటు పశ్చిమాన్నుంచి రెండవరంగంగూడా ప్రారంభమయిన తరువాత అన్నివైపులనుంచి హిట్లర్ మూకలను నాశనంచేయగల శక్తులు ఒక్కమారుగా తలయెత్తినాయి. హిట్లర్ ఓటమి దగ్గరలోకి వచ్చింది. హిట్లర్ ఓటమితో యూరపియన్ ప్రజలందరి స్వాతంత్ర్యసమస్యలన్నీ ముందుకు వస్తున్నాయి. యూరపియన్ ప్రజల స్వాతంత్ర్య సమస్యలో పోలెండు స్వాతంత్ర్యసమస్యగూడా ఒకభాగం.

నాజీమూకలనుంచి విముక్తిఅయిన పోలెండులో ప్రభుత్వఅధికారం ఎవరిది ? 1939 లో హిట్లర్ పోలెండుమీద దాడిచేసినప్పుడు దేశాన్ని, ప్రజలను వదిలిపెట్టి వెళ్ళి లండన్ లోకూర్చున్న పాత పోలిష్ప్రభుత్వానికా తిరిగి అధికారం ? లేక దేశంలోనే ఉండి ఇతర ప్రజలందరితోపాటు తమ దేశంలోగూడా జాతీయఐక్యతను నిర్మిస్తూ హిట్లర్ సైన్యాలతో పోరాడు తున్న పోలిష్ప్రజలకా ప్రభుత్వాధికారం ? ఇదే నేటి పోలిష్సమస్య.

బ్రిటన్, అమెరికా దేశాల్లోఉన్న సోవియట్ వ్యతిరేకుల అండతో ఫాసిస్టుకుట్రలను గావిస్తూన్న పోలిష్ప్రభుత్వం, పోలెండుమీద అధికారం తనదే అంటుంది. దేశానికి ఆపత్తువచ్చినప్పుడు దేశాన్ని వీడిపోయి ఫాసిస్టువ్యతిరేక పోరాటానికి హానికల్గించే కుట్రలుచేసిన పోలిష్ప్రభుత్వం తిరిగి పోలెండులో అధికారం చలాయించటానికి వీల్లేదంటారు పోలిష్ ప్రజలు.

సోవియట్ వ్యతిరేకతయే ప్రధానంగా పెట్టుకున్న పోలిష్ప్రభుత్వం ఫాసిస్టులతో కుట్రలుచేసిన తరువాత, సోవియట్ కు పోలిష్ప్రభుత్వానికి రాజకీయసంబంధాలు తెగిపోయినాయి. అప్పటినుంచి ఈనాటివరకూ సోవియట్ తో తిరిగి సంబంధాలు కల్పించుకొనుటకు పోలిష్ప్రభుత్వం తయారుకాలేదు. సోవియట్ కుచెందిన ప్రాంతాలనుగూడా ఆక్రమించాలని పోలిష్ప్రభుత్వ ఆశయం.

పోలిష్‌ప్రభుత్వానికి, సోవియట్‌కు మధ్య తగాదా ఒక సరిహద్దు తగాదా మాత్రమే కాదు. హిట్లర్ ఓటమికి భయపడే ముఠాలలో లెక్కించ తగిన పోలిష్‌ప్రభుత్వం సోవియట్‌వ్యతిరేక కుట్రలలో కలిసి ఎలా పని చేసిందీ, నేడుగూడా అదేవైఖరి ఎలా అనుసరిస్తున్నదీ. "పోలిష్ - సోవియట్ తగాదా" విషయంలో బ్రిటన్, అమెరికన్ ప్రభుత్వాల వైఖరి, సోవియట్ సూచనలు, పోలిష్‌ప్రజల స్వాతంత్ర్యప్రయత్నాలు, భవిష్యత్ స్వతంత్రపోలెండు నిర్మాణం—ఈ విషయాలన్నీ ఈ స్తకంలో వివరించబడినాయి. పోలిష్‌ప్రజాస్వాతంత్ర్య సమస్యను సమగ్రంగా తెలిసికొనుటకై పోలెండుప్రజలు, వారి రాజకీయాలు చారిత్రకంగా క్లుప్తంగా ఇవ్వబడినాయి.

యూరపియన్ రాజకీయాల్లో ఎన్నడూజరుగని విప్లవకరమైన మార్పులు వస్తున్నాయి. ఒక నూతన విప్లవచరిత్ర యూరప్‌లో నిర్మించబడుతోంది. ఇటలీలో ప్రజాప్రభుత్వం ఏర్పడింది. పీటర్‌రాజు టిటోను గుర్తించాడు. స్వాతంత్ర్యకమిటీని అమెరికాతోపాటు ఇతర రాజ్యాలుగూడా గుర్తించేరోజులు వచ్చినాయి. యూరప్‌లో అన్నిదేశాల్లో తలఎత్తుతున్న నూతన ప్రజాఉద్యమాలతోపాటు, నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాలకు అంకురాలు వేయబడుతున్నాయి. యూరప్‌లో తమ పెత్తనం కొరకు సామ్రాజ్యవాదులు వేస్తున్న ప్లానులన్నీ ఒకటితరువాత ఒకటి భగ్నమవుతున్నాయి.

ఫాసిస్టుల ఓటమితోపాటు సామ్రాజ్యవాదుల ప్లానులు, పాత ప్రభుత్వాల కుట్రలుగూడా భగ్నమయిన ఫలితంగా నిర్మించబడుతున్న నూతన ప్రజాయూరప్‌లో ఒక ముఖ్యభాగంగా స్వతంత్ర ప్రజాపోలెండు ఎలా నిర్మించబడుతున్నదీ ఈచిన్న పుస్తకంలో వివరించబడింది.

బెజవాడ<br>జులై — 1944

— సంపాదకుడు




1. 1914–18 యుద్ధానంతరం పోలెండు నిర్మాణం :

1919 వెర్సైల్స్ సంధిప్రకారం నిర్ణయించబడిన పోలిష్ పరిహద్దులు. తరువాత 1921 లో సోవియట్ యూనియన్‌నుంచి అక్రమంగా ఆక్రమించుకున్న ప్రాంతం. 1920 లో జర్మనీనుంచి అక్రమించిన సిలీషియాప్రాంతం. 1938 లో హిట్లర్ జకోస్లోవేకియాను మ్రింగినపుడు పోలిష్ ప్రభుత్వం ఆక్రమించిన టెషెన్ ప్రాంతం ఈపటంలో చూపబడినాయి.




## 2. పోలెండు — మైనారిటీల సమస్య :

మైనారిటీలుగా ఉన్న తెల్లరష్యన్లు, యుక్రేనియన్లు, లిథూనియన్లు, జర్మన్లు పోలెండులో ఏయే ప్రాంతాల్లో నివశిస్తున్నారో చూపబడింది. 1939 సెప్టెంబరులో సోవియట్ యూనియన్‌కు చెందిన తెల్లరష్యన్లు, యుక్రేనియన్లు తిరిగి సోవియట్ భూమిలోకి తీసుకోబడ్డారు.

3. పోలిష్ — సోవియట్ సరిహద్దులు:

1919 లో వెర్సేల్ సంధి నిర్ణయించిన కర్జన్ సరిహద్దు. దాన్ని అతిక్రమించి పోలిష్ ప్రభుత్వం 1921 లో ఆక్రమించిన సరిహద్దు. 1939 సెప్టెంబరులో రెడ్ ఆర్మీ ఆక్రమించిన హద్దు పైపటంలో చూపబడినాయి: 39 లో రెడ్ ఆర్మీ సోవియట్‌కు చెందిన ప్రాంతాలను ఆక్రమించినపుడు, 1, 2 ప్రాంతాలు లిథూవియాకు తిరిగి ఇచ్చివేయబడినాయి.




## 4. నూతన పోలెండు నిర్మాణం:

సోవియట్‌కు చెందిన తెల్లరష్యా, యుక్రెయిన్ ప్రాంతాలను తిరిగి సోవియట్ యూనియన్‌లోనే ఉండాలని, పూర్వం పోలెండుకు చెందిన జర్మనీలో ఉన్న (!) పోమరేనియా (2) తూర్పుప్రష్యా (3) సిలీసియా ప్రాంతాలను తిరిగి పోలెండులో కలిపి నూతన పోలెండును నిర్మించాలని పోలిష్ దేశభక్తుల స్వాతంత్ర్య ప్రకటన ఘోషిస్తోంది.

# 1. పోలెండు సమస్య

1939 సెప్టెంబరు 1వ తేదీ — ఈ యుద్ధం ప్రారంభమయిన రోజున హిట్లర్ దురాక్రమణదారుల సైన్యాలు జర్మన్ సరిహద్దులను దాటి పోలెండులో జొరబడ్డాయి. 45 ఫాసిస్టు కాల్బలపు సైన్యాలు, 5 పాన్జర్ దళాలు, 4 యంత్రసన్నాహంతో నడిచే దళాలు, 6 మోటార్ దళాలు, 2300 యుద్ధ విమానాలతో కూడిన 2 విమాన దళాలు పోలెండు భూముల మీద పడి నాశనంచేయడం ప్రారంభించినాయి. ముఖ్యపట్టణా లన్నిటిమీద విరామంలేకుండా బాంబుల వర్షం కురిసింది.

ప్రక్కనే ఉన్న సోవియట్ ప్రజల సహాయాన్ని నిరాకరించిన పోలెండు ప్రభుత్వం దూరాన ఉన్న బ్రిటన్, ఫ్రాన్సుల హామీలమీద ఆధార పడింది. దాడి ప్రారంభమయేసరికి బ్రిటన్, ఫ్రాన్సులనుంచి ఏ సహాయం రాలేదు. 17 రోజుల్లో పోలెండు కూలిపోయింది. స్వదేశాన్ని, ప్రజలను వదిలి పోలెండు ప్రభుత్వం లండన్ వైపుకు పలాయనమైంది. మాతృ దేశాన్ని, దేశస్వాతంత్ర్యాన్ని ప్రాణంగా భావించుకొనే పోలెండు ప్రజలు కొన్నిప్రాంతాల్లో ధైర్యంగా నిలబడి శత్రువును ఎదుర్కొన్నారు. మొండిగా చివరివరకూ పోరాడారు. కాని, దేశరక్షణకై యుద్ధసన్నాహాలు సరిగా లేనటువంటి చిన్నదేశానికి చెందిన ప్రజలు, ప్రభుత్వం దేశాన్ని వీడి పారి పోయిన తరువాత, ఎన్నోదేశాలను మ్రింగి మీదికి దుమికి వస్తున్న హిట్లర్ సైన్యాల ధాటి ముందు ఆగలేకపోయారు. నాజీ హంతకులు పోలెండు స్వాతంత్ర్యాన్ని తాత్కాలికంగా నాశనం గావించారు.

పోలెండులో ప్రభుత్వం లేకుండాపోయి, పోరాటశక్తి నశించి పోయిన తరువాత, హిట్లర్ సైన్యాలు దేశంమీద పడి ఆక్రమిస్తున్నప్పుడు తూర్పునుంచి సెప్టెంబరు 17వ తేదీన రెడ్ఆర్మీ సోవియట్ సరిహద్దులను దాటి పోలెండులో ప్రవేశించింది. తమదేశానికి చెందిన తెల్లరష్యన్లను, యుక్రేనియన్లను హిట్లర్ బారినుండి రక్షించింది. 1919లో పోలెండు ప్రభుత్వం అక్రమంగా స్వాధీనపరచుకున్న తెల్లరష్యన్ ప్రాంతాన్ని, యుక్రేనియన్ ప్రాంతాన్ని తిరిగి రెడ్ఆర్మీ సోవియట్ భూమిలో కలుపు కుంది.

వెంటనే సోవియట్ వ్యతిరేకుల ప్రచారం ప్రారంభమైంది. రష్యా జర్మనీలు పోలెండును పంచుకున్నాయి. 1939 ఆగస్టులో రష్యా-జర్మనీల మధ్య జరిగిన నిరాక్రమణ ఒడంబడిక సమయంలోనే ఈ పంపకం నిర్ణయించబడిందన్నారు; వెనుకనుంచి రష్యా పోలెండు వెన్నులో పొడిచిందన్నారు; పోలెండుకు, సోవియట్‌కు మధ్యవున్న నిరాక్రమణ ఒడంబడికను సోవియట్ పాటించలేదన్నారు; సోవియట్ సైన్యాలు ప్రవేశించక పోతే మరికొంతకాలం పోలెండు సైన్యాలు హిట్లరును యెదుర్కొనివుండేవన్నారు; సోవియట్ ప్రభుత్వంకూడ ఇతర సామ్రాజ్యవాదులవలె ఒక సామ్రాజ్యవాద ప్రభుత్వమన్నారు; పోలెండు ప్రజల స్వాతంత్ర్యంకాదు యీ ప్రచారకులకు ప్రధానమైంది; నాజీ దురాక్రమణదారులనుకాదు వీరు గర్హించింది; నాజీ దురాక్రమణను అరికట్టి పోలెండు మొదలైన యూరపియన్ దేశాల స్వాతంత్ర్యాన్ని రక్షించుటకై, అసలు ఈయుద్ధంరాకుండా చేయుటకై, బ్రిటన్, ఫ్రాన్సు, సోవియట్ యూనియన్ ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఐక్యం కావాలని, చివరి నిమిషంవరకు ప్రయత్నించిన సోవియట్ యూనియన్‌తో ఒడంబడిక చేసుకొనక, ఇప్పుడు దురాక్రమణ ప్రారంభమైనతరువాతగూడా ఇంకా సోవియట్ వ్యతిరేక ప్రచారానికే దిగారు సామ్రాజ్యవాదులు, సోవియట్ వ్యతిరేకులు.

ఈ యుద్ధకాలంలో, యుద్ధం జరిగినకొలదీ, సోవియట్ యూనియన్‌యొక్క సామ్రాజ్య వ్యతిరేక ఆశయాలు రోజురోజుకు అధికసంఖ్యాకులకు స్పష్టమౌతున్నప్పటికీ, పైన చెప్పబడిన అపోహలవల్ల బాధపడే దేశభక్తులు కొందరు ఇంకా లేకపోలేదు. అందువల్ల యీ విషయాలనన్నిటినీ ముందు వివరంగా పరిశీలిద్దాం.

ప్రస్తుతం తిరిగి పోలెండు చరిత్రకువద్దాం. 1941 మే నెలాఖరికి యూరప్‌వంతా కబళించిన హిట్లర్ పోలెండులో తన సరిహద్దును దాటి 41 జూన్ 22 వ తేదీన రష్యామీద పడ్డాడు. పోలెండంతా యిప్పుడు హిట్లర్ ఆక్రమణక్రిందికి వచ్చింది. ముందుకువెళ్ళి హిట్లర్ రష్యాలో కొంతభాగాన్ని ఆక్రమించాడు. 18 నెలలు కాచుకుని కాచుకుని చూస్తున్న రెడ్‌ఆర్మీ హిట్లర్ సైన్యాలను స్టాలిన్‌గ్రాడ్‌వద్దనుంచి వెనక్కి తరుముట ప్రారంభించింది. 1942 లో స్టాలిన్‌గ్రాడ్‌వద్ద ప్రారంభమైన రెడ్‌ఆర్మీ విజయ పరంపరలు నాజీ సైన్యాలను రష్యన్ సరిహద్దులనుంచి బైటికి నెట్టినాయి. నేడు రెడ్‌ఆర్మీ తిరిగి పోలెండులో ప్రవేశించి, ఫాసిస్టులను

నాశనంగావిస్తోంది. పోలెండులో రెడ్ఆర్మీ ప్రవేశించినరోజున తిరిగి పోలెండు స్వాతంత్ర్య సమస్య ముందుకువచ్చింది.

ఫాసిస్టుల ఓటమికి దారి తీస్తున్న రెడ్ఆర్మీకితోడుగా రెండవరంగం పశ్చిమ యూరప్‌లో ప్రారంభమైంది. హిట్లర్ ఓటమి, ఫాసిస్టుల ఓటమి దగ్గరపడింది. దానితోపాటు యూరపియన్ దేశాలన్నిటితోపాటు పోలెండు స్వాతంత్ర్యంకూడ దగ్గరకు వస్తోంది. కాని పోలెండు ప్రజల స్వాతంత్ర్యాన్ని నిరోధించే కొత్తశక్తులు మళ్ళీ తల యెత్తుతున్నాయి. కొత్త చిక్కులు ప్రారంభమైనాయి.

హిట్లర్ దురాక్రమణనుంచి విముక్తి అయిన పోలెండులో యెటు వంటిప్రభుత్వం యేర్పడాలి? ఆపత్సమయంలో దేశాన్ని, ప్రజలను వదిలి పెట్టివెళ్ళి లండన్‌లోకూర్చున్న పాత పోలెండు ప్రభుత్వం తిరిగి పోలెండు ప్రజలమీద పెత్తనం సాగించాలంటుంది. ఈ అజ్ఞాత ప్రభుత్వానికి అండగా బ్రిటన్, అమెరికా సామ్రాజ్యవాద ప్రభుత్వాలున్నాయి. ఫాసిస్టుల బారినుండి విముక్తి అయిన దేశాలలోని ప్రజలు వారి ఇష్టప్రకారం వారు కోరుకునే ప్రభుత్వాలను యేర్పరచుకుంటూ ఫాసిస్టులు పూర్తిగా నాశనమయేవరకూ ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పూర్తిగా పాల్గొనాలని సోవియట్ సిద్ధాంతం పోలెండు సమస్య ఈవిధంగా ఉంది.

ఇది ఒక పోలెండు సమస్యయేకాదు. హిట్లర్ ఓటమితో యూరప్ ఖండంలోవున్న దేశాలన్నిటిలో ముందుకువస్తున్న సమస్య ఇదే. స్వాతంత్ర్యాన్ని నాశనంగావించుటకు వచ్చిన హిట్లర్ హంతకులను, ఎన్ని బాధలకైనా ఓర్చి, ఎదుర్కొని పోరాడుతున్న ప్రజలు తమ ప్రభుత్వాలను నిర్ణయించుకుంటారా? లేక ప్రపంచ పెత్తనంకొరకు ఇంకా ప్రాకులాడే బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు యూరప్‌లో తమ ప్రాబల్యం కొరకు సాగిస్తున్న కుట్రలు ఫలించుటకు అవకాశం వుందా? పోలెండు భవిష్యత్తు ఏమిటి?

ఈ సమస్యల నన్నిటిని ఒకటితరువాత ఒకటి చూద్దాం.

# 2. పోలెండు, పోలిష్ ప్రజలు

పోలెండు చాలా పురాతనమైన దేశం. క్రీ. శ 966 నుంచి 1772 వరకూ స్వతంత్ర రాజ్యంగా ఉండేది. అప్పటిలో అది బలమైన దేశంగానే ఉండి ఒకప్పుడు ఇతర దేశాలనుగూడా ఆక్రమించింది, కాని 18 వ శతాబ్దంలో శక్తివంతంగా బలపడిన రష్యన్ జారు, ఆస్ట్రియన్, ప్రష్యన్ సామ్రాజ్యాధిపతులమధ్య చిక్కుకొని పోలెండు తన స్వాతంత్ర్యాన్నికూడా కోల్పోయింది. పై ముగ్గురు సామ్రాజ్యాధిపతులు కలిసి 1772, 1793, 1795 సంవత్సరాల్లో 3 సార్లు పోలెండును పంచుకున్నారు. తనచుట్టూ వుండే సామ్రాజ్యాధిపతుల మధ్యగల భేదాలను ఆధారం చేసుకుని తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకు ప్రయత్నించినా, 1795 లో పోలెండు స్వాతంత్ర్యం మరొక శతాబ్దం పైగా అంతరించింది. రష్యన్ జారు ప్రభుత్వంక్రింద పోలెండు ఒక బానిసదేశంగా చిక్కుకొని పోయింది.

తరువాత 120 సంవత్సరాలు పోలెండు ప్రజలు స్వాతంత్ర్యంకొరకు తహతహలాడారు. 1914 - 18 యుద్ధంలో అవకాశం వచ్చింది. అయితే ఆసామ్రాజ్యవాద యుద్ధంలో పోలెండు ఏపక్షంలో ఉండాలి ? అనే ప్రశ్న వచ్చింది. జర్మన్ సామ్రాజ్యవాదులు, రష్యన్‌జారు ఇద్దరూ పోలెండు స్వాతంత్ర్యాన్ని వాగ్దానం చేశారు. పోలెండునాయకులు రెండువైపులా పోట్లాడారు. మొదటిలో జర్మనీపక్షాన; తరువాత మిత్రమండలి పక్షాన. రష్యన్లకు వ్యతిరేకంగా జోసెఫ్ పిల్సుడిస్కీ పోలెండుసైన్యాలను నడిపాడు. పిల్సుడిస్కీ తరువాత పోలెండు నాయకుడుగా తయారైనాడు. అతని జాతీయ దురహంకారం, అతడు అనుసరించిన దురాక్రమణపంథాయే పోలెండుకు దురవస్థలు తీసుకొనివచ్చిందని చూస్తాం. కాని పిల్సుడిస్కీ యువకుడుగా ఉన్నరోజుల్లో రష్యన్ జారుప్రభుత్వాన్ని మనసార ద్వేషించిన విప్లవవాది. 1867 లో లిథూనియాలో జన్మించి, రష్యాలో ఎక్కువ కాలాన్ని గడిపాడు. ఆరోజుల్లో జారుప్రభుత్వానికి వ్యతిరేకంగా రష్యాలో పనిచేస్తున్న రహస్య ఉద్యమంలో పాల్గొన్నాడు, సైబీరియాలో 5 సంవత్సరాల ప్రవాసశిక్షను అనుభవించాడు. తరువాత లండన్‌లో ప్రవాసం; వార్సా (పోలెండు ముఖ్యపట్టణం)లో ఖైదు. 1914 లో యుద్ధం బయలు

దేరిన వెంటనే పోలిష్ ప్రజలను సమీకరించి జర్మన్ సామ్రాజ్యవాదుల అండతో రష్యన్లతో పోరాడాడు. 1917 లో రష్యన్లు అపజయాలు పొందుతున్న రోజుల్లో జర్మనీప్రభువులు వచ్చి వార్సాను ఆక్రమించారు. ఇంతకాలంనుంచి తమపక్షానపోరాడిన పిల్సుడిస్కీని ఖైదుచేశారు. పోలెండుకు చేసిన వాగ్దానాలు అన్నీ మట్టికలిసినాయి. కాని జర్మనీపతనం సమీపించింది. జర్మనీలో విప్లవం బయలుదేరింది. 1918 లో జర్మనీ ఓటమితో, పిల్సుడిస్కీ వార్సా చేరుకున్నాడు. పోలెండు నాయకుడైనాడు. పోలెండు స్వతంత్రదేశంగా పరిణమించింది చివరికి. కాని పిల్సుడిస్కీ ప్రభుత్వం స్వతంత్ర పోలెండుతో తృప్తిపడలేదు. జాతీయ దురహంకారం వారిలో ప్రబలింది. సామ్రాజ్యతృష్ణ బయలుదేరింది. సోవియట్ వ్యతిరేకంగా తమ లాభాలకొరకై పోలెండును ఉపయోగించుకోవాలని బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా మొదలైన సామ్రాజ్యవాదుల చేతుల్లో పోలిష్‌ప్రభుత్వవర్గాలు కీలుబొమ్మలుగా తయారై సోవియట్ మీదికి యుద్ధానికి దిగాయి. ఈ జాతీయ దురహంకారం, పోలెండు ప్రభుత్వవర్గాలు అనుసరించిన ప్రజావ్యతిరేక వైఖరి పోలెండు నాశనానికి ఎలా దారితీసిందీ తరువాత ప్రకరణంలో పరిశీలిద్దాం.

1919 జనవరిలో జర్మనీకి, మిత్రమండలికి జరిగిన వెర్సైల్స్ సంధి ఫలితంగా మిత్రమండలి దేశాలు పోలెండు స్వాతంత్ర్యాన్ని గుర్తించినాయి. ఈ సంధి ఫలితంగా యూరప్‌లో నిర్మించబడిన కొత్తరాజ్యాలలో పోలెండు ఒకటి. ఈ కొత్తదేశా లన్నిటిలోకి పోలెండు పెద్దది. పూర్వం రష్యన్, ఆస్ట్రియన్, ప్రష్యన్ సామ్రాజ్యాలలో పోలిష్‌భాష మాట్లాడుతూ ఉన్నటువంటి పోలిష్‌ప్రజలను, ఇతర ప్రజలను అందరిని కలిపి, నూతన సరిహద్దులను నిర్ణయించి ఒక పెద్ద పోలెండును, మిత్రరాజ్యాలన్నీ సృష్టించినాయి. పూర్వం జర్మనీకి చెందిన 'పోజెన్' రాష్ట్రాన్ని, లిధూనియాకు చెందిన విల్నాను, జర్మన్లు అధికసంఖ్యాకలుగా ఉన్న 'కారిడర్' ను, పోలెండులో కలిపారు. డాన్జిగ్ స్వతంత్ర పట్టణం పోలెండు యాజమాన్యం క్రిందికి వచ్చింది. వోటింగు ఫలితంగా తూర్పు సిలీసియా వచ్చి పోలెండులో చేరింది. ఈ అదనపులాభాలతో తృప్తిచెందక పోలిష్‌ప్రభుత్వం సోవియట్ యూనియన్ మీదకు దాడివెడలి, అప్పటిలో సోవియట్ బలహీనతను ఆదునుగా తీసుకొని, సోవియట్‌నుంచి పశ్చిమ యుక్రెయిననుకు, పశ్చిమ తెల్లరష్యాను తనలో కలుపుకుంది.

ఈ దురాక్రమణల ఫలితంగా 1,50,000 చదరపుమైళ్ళ వైశాల్యంగల పోలెండుదేశం తయారైంది. వైశాల్యాన్నిబట్టి యూరప్‌లో అది 5 వ పెద్ద దేశం. సోవియట్ వ్యతిరేకములైన మిత్రమండలి రాజ్యాలన్నీ ఈవిధంగా నిర్మించబడిన పోలెండును గుర్తించుటలో ఆశ్చర్యంలేదు. కాని నూతన పోలెండును నిర్మించిన పిల్సుడిస్కీ మొదలైన జాతీయదురహంకారవాదులు కొత్త చిక్కులలో పడ్డారు. పరప్రభుత్వాల చేతుల్లో పరప్రభుత్వాల లాభాల కొరకు కీలుబొమ్మలుగా ఉపయోగించబడుతున్నారనే యధార్థాన్ని ఆనాటి నుంచి ఈనాటివరకూ పోలిష్‌ప్రభుత్వవర్గాలు గ్రహించలేవు. ప్రజలను గుర్తించకపోవుట, దేశస్వాతంత్ర్యమే గాక సామ్రాజ్యతృష్ణ, జాతీయ దురహంకారం—ఇవే వారి దుష్ప్రవర్తనకు ప్రధాన కారణాలు.

* * * *

ఇక దేశంలో ప్రవేశించి పోలెండు ప్రజలను పరిశీలిద్దాం. పోలెండు జనసంఖ్య 1939 నాటికి 340 లక్షలు. కాని వీరందరూ పోలిష్ భాష మాట్లాడే పోలిష్‌ప్రజలు కారు. వీరిలో 110 లక్షలు ఇతర జాతులకు చెందినవారున్నారు. జర్మన్లు, యుక్రేనియన్లు, తెల్లరష్యన్లు, గాలీసియన్లు, రథీనియన్లు, లిథూనియన్లు మొదలైన జాతులన్నీ ఉన్నాయి. ఈ మైనారిటీ జాతుల సమస్య పోలిష్‌ప్రజల జాతీయ రాజకీయాల్లో ఒక ప్రధానసమస్యగా పరిణమించింది. కాని జాతీయ దురహంకారంతో, సామ్రాజ్యతృష్ణతో పైకి వచ్చిన పోలెండు ప్రభుత్వవర్గాలు ఈ మైనారిటీ జాతుల సమస్యను సరిగా పరిష్కరించలేకపోవుటయేగాక, వారిని నానాహింసలూ పెట్టి సమస్యను విషమంచేశాయి. ముఖ్యంగా పోలెండు భూస్వాముల ప్రభుత్వం క్రింద యుక్రేనియన్లు, యూదులుపడ్డ బాధలు చెప్పనలవికాదు. బానిస యుగంనాటి బానిసలుగా వీరు పరిగణించబడ్డారు. హింస, దౌర్జన్యం, లంచాలు, అక్రమపన్నులు, ఊడిగాలు - అన్నీ ప్రవేశపెట్టబడ్డాయి. యుక్రేనియన్ల సంఖ్య 60 లక్షలు. వీరికి 1923 లో స్వయంనిర్ణయాధికారం ఇస్తామని వాగ్దానం చేసిన పిల్సుడిస్కీ ప్రభుత్వం, వాగ్దానాన్ని చెల్లించక పోగా, ఈ 60 లక్షలమందిని పోలీసులు, ప్రభుత్వాధికార్లు కలిసి పీల్చి పిప్పిచేశారు. గాలీసియాలో 1912 లో ఉన్న యుక్రేనియన్ పాఠశాలల సంఖ్య 2420. కాని పోలిష్‌ప్రభుత్వం క్రింద ఈ సంఖ్య 745 కు క్షీణించింది.

కరుడుగట్టిన సామ్రాజ్యవాది అయిన లాయడ్‌జార్జి 1938 లో మైనారిటీ జాతులపట్ల పోలెండు ప్రభుత్వవర్గం అవలంబించిన వైఖరిని గురించి ఈ విధంగా వ్రాశాడు.

" పోలెండు ప్రభుత్వం మహాదోషి. జినీవాలో 1934 లో జరిగిన మైనారిటీ జాతుల ఒడంబడికను ఒక్క ప్రకటనతో పోలిష్ ప్రభుత్వం తన్నివేసింది. ఆ ఒడంబడిక తనకు వర్తించదని పోలెండు ప్రభుత్వం ప్రకటించింది. ఇతర దేశాలు పాటించనప్పుడు తనకూ వర్తించదని బాహాటంగా చెప్పింది.

" యుక్రేనియన్లకు (కనీసం తూర్పు గెలీసియాకు), స్వయం పరిపాలనా హక్కును ఇస్తామని చేసిన వాగ్దానాన్ని భగ్నం గావించింది. ఈ జాతికిచెందినవారు సుమారు 65 లక్షలమంది పోలెండులోవున్నారు. వీరిలో సగంమంది తూర్పు గెలీసియాలో నివసిస్తున్నారు. పూర్వం ఈ ప్రాంతాలను పరిపాలించిన ఆస్ట్రియన్ సామ్రాజ్యాధిపతుల క్రిందగూడా ఈ ప్రజలు ఇన్ని బాధలు పడలేదు. ఆకాలంలో వారికి కొంతవరకైనా స్వయం పరిపాలనా హక్కు ఉండేది. ఇప్పుడు అదిగూడా అంతరించింది. ఈ ప్రజల యొక్క వ్యక్తిగత, మత, రాజకీయ హక్కులకు హామీయిచ్చే స్వయం పరిపాలనావిధానాన్ని మిత్రమండలి రాజ్యాలతో సంప్రతించి, ప్రవేశపెట్టే షరతుమీద ఈ ప్రాంతాలు 1919లో పోలెండు అధీనం చేయబడినాయి. కాని పోలెండు ప్రభుత్వం సిద్ధాంతంలో జాతిభేదాలనుబట్టి ఈ ప్రాంతానికి స్వయంనిర్ణయాధికారం ఇవ్వాలని 1923లో గూడా అంగీకరించినా ఆచరణలో యుక్రేనియన్లను చెప్పరాని హింసలు పెట్టసాగింది. ఏషరతుమీద ఈరాష్ట్రాలు పోలెండు అధీనం చేయబడినవో, ఆషరతును నేటివరకుపోలిష్ ప్రభుత్వం అమలుచేయలేదు. 1930లో పోలిష్ ప్రభుత్వహత్యాకాండ మితిమీరి బ్రిటిష్‌ప్రజల ఆందోళన ఫలితంగా 'జాతిసమితి' ముందుకు ఈసమస్య వచ్చినపుడు, జపాన్ ప్రతినిధి ప్రవర్తనఫలితంగా ఆ సమస్య చర్చకుగూడా రాకుండా 1 సంవత్సరం ఆలస్యంచేయబడింది. ఈలోపల పోలెండుప్రభుత్వం తన యిష్టానుసారంగా పోలెండులోని మైనారిటీలను హింసిస్తూనేవచ్చింది."

('truth about the peace treaties' Mr. L loyd george 1938.)

పోలెండులో నివసిస్తున్న ప్రజలపట్ల పోలెండు ప్రభుత్వపువైఖరి ఇది ! ఇక యూదుల విషయంలో చెప్పనక్కరలేదు. 1929లో ఆర్థిక సంక్షోభం ప్రారంభమయేవరకూ యూదులపట్ల ప్రభుత్వవైఖరి ఒక మాదిరిగా

ఉండేది. 1929 తరువాత వీరిని చెప్పరాని చావులకు గురిచేసింది పోలిష్ ప్రభుత్వం. తన సరిహద్దులలో నివసిస్తున్న 35 లక్షల యూదులలో (వీరిలో ఎక్కువభాగం యుక్రేనియన్, తెల్లరష్యా రాష్ట్రాలకు చెందిన రష్యన్లు) కనీసం 25 లక్షలమంది సైనాదేశంనుంచి బయటికి తరిమివేయవలసి యున్నదని పోలెండుప్రభుత్వం జెనీవాలో బహిరంగంగా ప్రకటించింది :

1937 నవంబరు 27వ తేదీన బ్రిటిష్‌పత్రిక అయిన డెయిలీహెరాల్డు పోలిష్‌ప్రభుత్వం పెట్టే హింసలను గురించి ఈ దిగువ విధంగా వ్రాసింది.

"పోలెండులోని యూదులందరూ బలత్కారంగా వలసపోవలసి వస్తోంది. ఈ బాధతోపాటు, 1935లో పిల్సుడిస్కీ చనిపోయినప్పటినుంచి చరిత్రలో ఎప్పుడూ కనివిని ఎరుగనటువంటి అగచాట్లకు వారు లోనవు తున్నారు. భయంతో కంపిస్తూ అటువంటి దీనావస్థకు వచ్చిన మరొకజాతి ఏదియూ ఎక్కడాలేదు. యూదులు బహిరంగంగా చంపబడుతున్నారు. యూదులకొరకు వేట ప్రారంభమయింది. వీధులలోనూ, బహిరంగస్థలా ల్లోనూ, యూదులు చావగొట్టబడుతున్నారు. యూదుల దుకాణాలెన్నో ధ్వంసం చేయబడినాయి ; లూటీ చేయబడినాయి. యూదుల ఇళ్లు కాల్చబడి నాయి. వ్యాపారం, ఇళ్ళూ పోగొట్టుకొని బ్రతుకుతెరువులేక వేలకువేల యూదులు ఆకలితో మాడే దరిద్రులుగా మారారు. బైలిస్టాక్ ప్రాంతంలో 1936లో 348 మందియూదులు చంపబడ్డారని పోలిష్ ప్రధానమంత్రియే అంగీకరించి యున్నాడు. ఆ సంవత్సరంలో మొత్తం 21 దాడులు జరిగినాయి."

1938 అక్టోబర్ 10 వ తేదీన మాన్‌చెష్టర్‌గార్డియన్ పత్రిక ఈ విధంగా వ్రాసింది:

"పోలిష్ పోలీసులు, గుర్రపుదళాలు పల్లెపల్లెకూపోయి రైతులను అరెస్టులుగావించి, కొరడాలతో బాదుతూ ఉండేవారు. ఇప్పుడు పోలిష్ ప్రభుత్వపుహింస మరొక రూపం తీసుకున్నది. యుక్రేనియన్ విద్యా విధానం, ఆర్థికజీవనం మీదనే తీవ్రదాడులు ప్రారంభమయినాయి."

ఈవిధంగా పోలిష్ ప్రభుత్వం, దేశంలోపల ప్రజలను నానాబాధలూ పెడుతూ నిరంకుశపరిపాలన సాగిస్తూ, సమయం దొరికితే ఇతరదేశాలను పోలెండులో కలుపుకొనుటకు ఆశిస్తూఉండేది. స్వతంత్రపోలెండులో జరుగుతున్న చరిత్ర ఇది.

* * * *

పోలెండు నిరంకుశప్రభుత్వం క్రింద పశ్చిమయుక్రెయిన్, బైలో రష్యాలు వలసదేశాలుగా మారినాయి. అని యారోస్లావస్కీ 1939 లో వ్రాశాడు. వలసదేశాలలో ప్రజలు ఏవిధంగా దోపిడీచేయబడి అణగద్రొక్కబడియుంటారో, అదేవిధంగా ఈ ప్రాంతాల్లో రష్యన్‌ప్రజలు 20 సంవత్సరాలపాటు పోలెండు ప్రభుత్వంక్రింద నానాబాధలు పడ్డారు. పోలెండు ప్రభుత్వంలో ఒకప్పుడు డిప్యూటీ ప్రధానమంత్రిగా ఉన్న క్వెయిట్కోవస్కీ పోలెండును 2 భాగాలుగా విభజించాడు; 'ఎ' ప్రాంతం; 'బి' ప్రాంతం అని ఈ రెండిటికి పేర్లు. 'బి' ప్రాంతంలో రష్యానుంచి కలుపుకున్న యుక్రెయిన్, తెల్లరష్యాలు వుంచబడినాయి. మిగిలినదంతా 'ఎ' ప్రాంతం.

పరిశ్రమలన్నీ—బొగ్గు ; ఇనుము : బట్టలపరిశ్రమలలో నూటికి 80 వంతులు ; పంచదార, సిమెంటు, విద్యుచ్ఛక్తి—మొదలైనవన్నీ 'ఎ' ప్రాంతంలో అభివృద్ధిచేయబడినాయి. ఈ ప్రాంతాల్లో రైలుమార్గ సౌకర్యాలు మూలమూల ప్రదేశాలకు గూడా చేయబడినాయి. అచ్చుయంత్రాలు; వైజ్ఞానిక, ఆరోగ్యఅభివృద్ధి సౌకర్యాలు నిర్మించబడ్డాయి. మొత్తం పోలెండులో ఉత్పత్తి అగు విద్యుచ్ఛక్తిలో నూటికి 93 వంతులు, ఎరువులలో నూటికి 80 వంతులు ; ఇనుములో 80 వంతులు, కాఫీ, టీ విషయంలో నూటికి 95 వంతులు 'ఎ' ప్రాంతంలో వినియోగించబడుతున్నాయి.

ఇక 'బి' ప్రాంతం ఒక వలసదేశంగా మారింది. 'ఎ' ప్రాంతంలో తయారుజేయు పారిశ్రామిక వస్తువులను 'బి' ప్రాంతంలో అమ్మటం ప్రారంభించారు. 'బి' ప్రాంతంలో ఉత్పత్తి అగు ముడిసరుకులను అతి చౌకగా కొని 'ఎ' ప్రాంతానికి తీసుకొని వెళ్తున్నారు. పోలెండులోనే పోలెండు ప్రభుత్వంక్రింద వలసదేశం తయారైంది. 'బి' ప్రాంతంలో పరిశ్రమలు అభివృద్ధిచేయుటకు అవకాశాలున్నా పోలెండు ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా అభివృద్ధిని ప్రోత్సహించకపోవుటయే గాక, వున్నపరిశ్రమలను గూడా నాశనంజేసింది. విల్నాప్రాంతంలో వున్న తోళ్ళపరిశ్రమను, బైలోస్టాక్ వద్ద వున్న బట్టలపరిశ్రమను, కలప పరిశ్రమను ప్రభుత్వం నాశనం చేసింది.

ఇక 'బి' ప్రాంతంలో వున్న రైతులపరిస్థితి ఏవిధంగా క్షీణించిందో చూడండి : ఈ ప్రాంతంలో వున్న భూమిలో సగభాగాన్ని 16000 పోలిష్ భూస్వాములు వశపరుచుకున్నారు. మొత్తం పోలెండులోని భూమిలో 5 వ వంతు 2000 మంది పెద్ద జమీందారుల చేతుల్లోకి వచ్చింది. బీద

రైతులను నిరంకుశంగా నెట్టివేసి 'బి' ప్రాంతంలోని భూములను పోలెండు భూస్వాములు ఆక్రమించుకొనుటయే గాక, పోలీసుల సహాయంతో ఆ ప్రాంతంలోని ప్రజలను నానాహింసలూ పెట్టారు.

1927 లో బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడైన నోయల్ బెకెట్ పశ్చిమ యుక్రెయిన్ ప్రాంతాన్ని దర్శించటం సంభవించింది. "వ్లాడిమిర్ అను ప్రాంతానికి వెళ్ళాను. ఇండియా నాకు తెలుసు. ఇండియాలోని పల్లె టూళ్ళలోని దుర్భరదారిద్ర్యాన్ని గురించి ఎరుగుదును. కాని యిక్కడ అంతకంటె ఘోరంగావున్నాయి పరిస్థితులు". అని తన అనుభవాలను గురించి చెప్తూ వ్రాశాడు. బెకెట్ దర్శించి వెళ్ళినతరువాత, పరిస్థితులు మరీ విషమించినవని యార్‌స్లావస్కీ వ్రాశాడు.

ఇక విజ్ఞానవిషయంలో—ఈ ప్రాంతంలోని ప్రజలను గూడా బలాత్కారంగా పోలిష్‌జాతిలో చేర్చుటకు ప్రభుత్వం అనేక ప్రయత్నాలు చేసింది. 1918 లో 3600 యుక్రేనియన్ స్కూళ్ళుఉండేవి. 1935 నాటికి వీటిసంఖ్య 457 కు తగ్గింది.. ఈ స్కూళ్ళలో గూడా చరిత్ర, భూగోళం మొదలైన విషయాలన్నీ పోలిష్‌భాషలో చెప్పటం ప్రారంభించారు: వోర్నియాజిల్లాలో 1919 లో 1050 యుక్రేనియన్ స్కూళ్ళు వుండేవి. 1936 నాటికి వీటిలో 5 మాత్రమే మిగిలినాయి. మొత్తం పోలిష్ యుక్రెయిన్‌లో 3000 స్కూళ్ళను, బైలోరష్యాలో 400 స్కూళ్ళను పోలెండు ప్రభుత్వం మూసివేసింది. దీని ఫలితంగా విద్యాశిక్షణ పూర్తిగా నశించింది.

పోలెండు అధీనంలోకి వచ్చిన యుక్రేనియన్, బైలోరష్యన్ ప్రజల దుస్థితి రోజురోజుకు విషమించుట చూచి 60 మంది బ్రిటిష్ లేబర్‌పార్టీ సభ్యులు 1930 లో ఒక పిటిషన్ తయారుజేసి జాతిసమితికి పంపించి, వెంటనే జోక్యం కలుగజేసుకోవాలని కోరారు. ఆ పిటీషన్‌లో:

"పోలెండులో ఉన్న 700 యుక్రేనియన్ పల్లెలలో, స్త్రీ పురుషలను, బిడ్డలను, పోలిష్‌ప్రభుత్వం ఘోరహింసలు పెట్తోంది. అనేకవేల మందిని జైళ్ళలో పారేసింది. గ్రంధాలయాలు, క్లబ్బులు, స్కూళ్లు, సహకార సంఘాలు నాశనంచేయబడినాయి. విద్యావిధానం, ప్రజాభిప్రాయం, ఆర్థికవిధానం— అన్నిటిలోనూ దౌర్జన్యం ప్రబలింది. బందిపోటు తత్వంతో ప్రభుత్వం ప్రజలను ఖూనీ చేస్తోంది. వెంటనే ఈ అమానుషకృత్యాలను ఆపండి" అని విజ్ఞప్తి చేయబడింది.

పోలెండు ప్రభుత్వంక్రింద 20 సంవత్సరాలు యుక్రేనియన్, బైలో రష్యన్ జాతులుపడ్డ బాధలు ఇవి.

* * * *

అయితే, ఈ నిరంకుశ పరిపాలన సాగాలంటే, దానికి అవసరమైన మిలటరీ, పోలీసు దళాలు గూడా సమాయత్తం చేసుకోవాలి. పోలెండు ప్రభుత్వవర్గాలు అధికారంలోకి వచ్చినప్పటినుంచి ఈ విషయంలో శ్రద్ధ తీసుకున్నారు. విపరీతమైన పన్నులను, రైతులనుంచి అక్రమ వసూళ్ళను గావించి, దానిఫలితంగా వచ్చిన ఆదాయంలోనుంచి నూటికి 40 వంతుల వరకూ సైనిక వ్యయంక్రింద ఖర్చుపెడుతూ ఉండేది. పోలెండులాంటి చిన్నదేశానికి 3½ లక్షల శాశ్వతసైన్యం. 16,45,000 రిజర్వుసైన్యం ఉన్న దంటే, పోలెండు ప్రభుత్వంయొక్క మిలటరీస్వభావం స్పష్టపడుతుంది.

పోలెండు వ్యవసాయిక దేశమనే చెప్పాలి. పారిశ్రామిక వస్తు సంపత్తి కొద్ది. శతాబ్దాల తరబడీ భూస్వామికయుగంనాటి సామ్రాజ్యాధిపతుల క్రింద అణిగిపడియున్న పోలెండుప్రజలు వ్యవసాయిక జీవనంలోనే ఎక్కువగా ఉండిపోయారు. 1918 లో పోలెండుకు స్వాతంత్ర్యం వచ్చినా భూస్వామిక యుగంనాటి సాంప్రదాయాలలో పెద్దమార్పులేవీ రాలేదు. ఫ్రాన్సు మొదలైన ఆధునికసామ్రాజ్యవాదులు పోలెండులో పెట్టుబడులు పెట్టుటవల్ల కొంతవరకు పరిశ్రమలు అభివృద్ధి అయినాయి. కాని, పోలెండు ప్రభుత్వవర్గాలలో భూస్వాములు, ప్రభువులకుగూడా ముఖ్యస్థానం ఉంది. ఇతర యూరపియన్ దేశాలనుంచి మిలటరీ శిక్షణ ఇప్పించుట కొరకై నిపుణులను తెప్పించి దేశానికి, దేశ ఆదాయానికి మించిన సైనికవ్యయం గావించి, నిరంకుశ పరిపాలనకు తోడ్పడే సిబ్బందులను తయారుచేసుకొనుటకు పోలెండుప్రభుత్వ వర్గాలు శ్రద్ధవహించాయి. ఫలితం దేశంలో ఒకరకమైన ఫాసిస్టు మిలటరీ పరిపాలన తయారైంది. ఈప్రభుత్వంయొక్క ఈఫాసిస్టు వైఖరి యుద్ధానంతరం (1914) రాజకీయాల్లో ప్రతి దశలోనూ కన్పిస్తుంది. పోలెండు స్వాతంత్ర్యాన్ని వెంటనే గుర్తించి పోలెండుతో స్నేహసంబంధాలు కోరే సోవియట్ప్రభుత్వమంటే పోలెండు ప్రభుత్వవర్గాల విముఖత్వానికి ఈఫాసిస్టు ధోరణియే కారణం.

పోలెండు వ్యవసాయక విధానాన్ని పరిశీలించినా ఈ విషయాలే స్పష్టపడతాయి. పూర్వకాలంనుంచి వస్తున్న జమీందారీ విధానంక్రింద 200 లక్షల పోలెండురైతులు దుర్భర పరిస్థితులలో చిక్కుకొని ఉన్నారు. పేద రైతులసంఖ్య నానాటికి హెచ్చింది. రోజురోజుకూ భూమి పెద్ద భూస్వా

ముల చేతుల్లో కేంద్రీకరింపబడుతూ వచ్చింది. ఉదాహరణకు: మొత్తం జన సంఖ్యలో 200వ వంతుగాఉన్న 19000 మంది పోలిష్‌భూస్వాముల చేతుల్లో. దేశంలో వ్యవసాయానికి లాయకీఅయిన భూమిలో నూటికి 45 వంతులు (దాదాపు సగం) ఉంది. మిగిలిన సగభాగంభూమి, లక్షలుగా ఉన్న పోలిష్ రైతాంగమునకు చెందిఉన్నది : ఇవి 1939లో పోలెండు పరిస్థితులు : ఈవిధంగా దరిద్రంలో క్రుంగిపోతున్న పోలెండురైతులకు 1914కు పూర్వం రెండు మార్గాలు ఉండేవి. ఇతర ప్రాంతాలకు వలసపోయేవారు, లేదా అప్పుడే అభివృద్ధి అవుతున్న పరిశ్రమలలో కూలీలుగాపోయి చేరుతూ ఉండేవారు. క్రమేణా ఈ మార్గాలుగూడా లేకుండా పోయినాయి.

1929—33 ఆర్థిక సంక్షోభకాలంలో పోలెండు రైతాంగముయొక్క పరిస్థితులు మరీ విషమించినాయి. ఈకాలంలో పారిశ్రామిక వస్తువుల ధరలను అలాగేఉంచి, వ్యవసాయకవస్తువుల ధరలను సగం లేక మూడోవంతుకు తగ్గునట్లు కుట్రలుచేసి, పోలిష్ భూస్వాములు, పెట్టుబడిదార్లు రైతులను నాశనం చేశారు.

నిరంకుశంగా ప్రవర్తిస్తున్న భూస్వాములు, భూస్వాముల ప్రభుత్వంక్రింద బాధలు పడలేని స్థితివచ్చింది. పల్లెప్రాంతాలకు నూతనచైతన్యం వ్యాపించింది. బ్రహ్మాండమైన రైతుఉద్యమం దేశమంతటా లేచింది. 1931 లో రైతుపార్టీ (స్ట్రోనిక్టోలుదోపీ) స్థాపించబడింది. 1935 లో ప్రభుత్వవర్గాలకు అనుకూలంగా ఉండే నియమాలతోజరిగిన ఎన్నికలను రైతులచేత బహిష్కరింపచేసి రైతుపార్టీ రైతాంగంలో బాగా బలపడింది. 1935 చివరలో ఈరైతుపార్టీ కార్యక్రమంలో "రైతుల అభివృద్ధికై" భూస్వాముల జమీలను స్వాధీనపరచుకోవాలనే ఆశయం గూడా చేర్చబడింది.

1933లో హిట్లర్ అధికారంలోకి వచ్చిన తరువాత, పోలెండు ఫాసిస్టు ప్రభుత్వవర్గాలకు, హిట్లరుకు మైత్రికుదిరింది. అంతవరకూ ఫ్రాన్సుతోస్నేహ సంబంధాలు పెంపొందించుకుంటూ వచ్చిన పోలెండుప్రభుత్వం బలమైన శక్తిగా పరిణమిస్తున్న హిట్లర్ నాజీ ప్రభుత్వంలోచేరి 1934 లో 10 సంవత్సరాలపాటు అమలులో ఉండే నిరాక్రమణ ఒడంబడికను చేసుకుంది. హిట్లర్ మైత్రితోపాటు పోలెండుప్రభుత్వ ధోరణిగూడా మరింత ఫాసిస్టుగా పరిణమించింది.

*  *  *  *

రోజు రోజుకు విషమిస్తున్న ఫాసిస్టు నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా అసమ్మతి తెలుపుతూ 1936 జూన్‌లో రైతుపార్టీ పెద్ద ఉద్యమాన్ని లేవదీసింది. పోలెండు ప్రభుత్వంయొక్క ఫాసిస్టు విదేశాంగవైఖరి మార్చుచేసుకోవాలని, ప్రజాస్వామిక పార్లమెంటరీ ప్రభుత్వాన్ని దేశంలో ప్రవేశపెట్టాలని, రైతు ఉద్యమ నాయకుడైన విటోస్‌ను జైలునుంచి విడుదల చేయాలని కోరుతూ రైతుపార్టీ ప్రభుత్వానికి ఒక పిటిషన్ పంపింది. ప్రభుత్వం ఆ పిటిషన్‌ను నిరాకరించింది. అప్పటినుంచి, ఆ పిటీషన్‌లో ఉదహరించబడిన రాజకీయ నినాదాలను ఆధారంజేసుకొని ఆందోళనగావిస్తూ రైతుపార్టీ బలమైన రాజకీయ ఉద్యమంగా అభివృద్ధి అయింది.

1937 లో రైతు ఉద్యమం మరీ ఉచ్ఛదశకు పోయింది. సమ్మెలు, సమ్మెలకాలంలో పోలీసులతో బాహాబాహీ ఆయుధ పోరాటాలు దేశమంతటా జరిగినాయి.

1937 లో జరిగిన రైతుల సమ్మెయొక్క ప్రభావం పోలెండులో అన్నిప్రాంతాల్లో విదితమయింది. 1938 అక్టోబరులో 50,000మంది పోలిష్ ఉపాధ్యాయులు, పారిశ్రామికకేంద్రాలలోని కార్మికులులేచి సమ్మెగావించారు. ఈ విధంగా ప్రారంభమయిన సమ్మె, దేశవ్యాపిత ఫాసిస్టు సమ్మెగా పరిణమించే పరిస్థితులలో, ప్రజా ఉద్యంతో మితవాద నాయకులు జోక్యం కలుగజేసుకొని ఎలాగా దానంతట అదే పోలెండు ప్రభుత్వం పతనం కానున్నదని ప్రజలను నమ్మించి దేశవ్యాపితసమ్మె రాకుండా చేశారు. ప్రభుత్వం కూడా కదిలి, ప్రభుత్వంలో ఉన్న పచ్చి ఫాసిస్టులను ప్రభుత్వంనుంచి తొలగించాల్సి వచ్చింది.

ఫాసిస్టు వ్యతిరేక ప్రజా ఉద్యమం రైతుపార్టీ, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వంక్రింద అతివేగంగా దేశమంతటా వ్యాపిస్తోంది. అంతర్జాతీయంగా పోలెండుకు బయట ఫాసిస్టుశక్తుల కూటమి బలపడుతూ, యుద్ధానికి కాలుదువ్వుతున్నకొలదీ, దేశంలోని ప్రభుత్వంయొక్క ఫాసిస్టు వైఖరి బయట ఫాసిస్టు జర్మనీ, ఇటలీ, జపాన్ దేశాలతో సంబంధాలు మరింత బహిర్గతమయినాయి. దినదినాభివృద్ధి చెందుతున్న ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని ధ్వసంచేయుటకు పూనుకుంది ప్రభుత్వం. ఈ ఆశయంతో, తెలివితేటలుగా రైతు ఉద్యమంలోనే ప్రవేశించింది. 'జాతీయపక్షం' అను ఒకపార్టీని లేవదీసి, దానిలో ఒక రైతుశాఖను ప్రారంభించింది. మేజర్ గెలినాట్ దానికి నాయకుడు. ఇతడు ఒకపెద్ద ఫాసిస్టు. ఈ రైతుశాఖ

తరపున పల్లెలలో ప్రవేశించి, పెద్ద విప్లవనినాదాలతో జమీందారీ విధానం నశించాలని ప్రచారంచేస్తూ, జాతీయపక్షాన్ని బలపరచాలనే వినాదాన్ని లేవ దీశారు. సహకార వ్యవసాయపద్ధతి ప్రవేశపెట్టాలన్నారు. మొత్తంమీద రైతుపోరాటాలు లేకుండా చేయటానికి, రైతులకు కార్మికవర్గానికి మధ్య స్నేహసంబంధాలు లేకుండా చేయుటకు, వీరు పనిచేస్తూ వచ్చారు. 'జాతీయపక్షమే' గాకుండా 'గ్రామ యువజన సంఘాల' పేరుతో మరొక సంస్థగూడా లేవదీయబడింది. పట్టణానికి, పల్లెలకు మధ్య స్నేహం అసంభవమని; కార్మికవర్గానికి—రైతులకు; పట్టణ ప్రజలకు—పల్లెవాసులకు ఎప్పుడూ వైరుధ్యం ఉండకతప్పదని విద్రోహక నినాదాలు లేవదీసి ప్రచారం సాగించేది ఈ గ్రామ యువజనసంఘం. ఈ విధంగా ప్రజా ఉద్యమాన్ని చీల్చి, ధ్వంసంచేయుటకు ప్రభుత్వవర్గం ఎన్నోకుట్రలు పన్నింది. పైన చెప్పబడిన విద్రోహక సంస్థలను ప్రారంభించింది, వ్యవసాయశాఖా మంత్రి అయిన పాన్యాటోస్కీయేనని గుర్తించాలి.

అయితే ఈప్రభుత్వ ప్రయత్నాలన్నీ విఫలమయినాయి. 1938 ఫిబ్రవరిలో క్రాకోపట్టణంలో సమావేశమయిన అఖిలపోలెండు రైతుమహాసభలో రైతాంగంయొక్క వైఖరి దృఢపరచబడింది

" ప్రభుత్వం ఎన్ని క్రూరహింసలు పెట్టినాసరే, ఎంత దౌర్జన్యం చేసినా, ఎటువంటి అమానుషశిక్షలు విధించినప్పటికి రైతువుద్యమాన్ని ప్రభుత్వం చీల్చలేదు. రైతులయొక్క హక్కులకే గాక, దేశప్రజలందరి ప్రభుత్వహక్కుకొరకు రైతుఉద్యమం పోరాడుటకు నిశ్చయించుకుంది" ప్రభుత్వనిర్బంధ విధానాన్ని ఎదుర్కొంటూ దేశవ్యాపిత సమ్మెకొరకు పని చేయుటకు, కార్మికవర్గంతో కలిసి విజయం సాధించుటకు మహాసభ తీర్మానించింది. హిట్లర్ ప్రభుత్వాన్ని పోలిష్ ప్రభుత్వం బలపరుచుట విషయంలో, ప్రభుత్వవైఖరిని తీవ్రంగా ఖండిస్తూ, ప్రభుత్వ విదేశాంగవైఖరి మారాలని డిమాండు చేసింది.

తరువాత 1939 లో జెకోస్లోవేకియాను హిట్లర్ ఆక్రమించబోయే సమయంలో, రైతుసమావేశం, రెనోపట్టణంలో జరిగింది. జెకోస్లోవేకియా పంపకాన్ని తీవ్రంగా ఖండిస్తూ పోలెండు ప్రభుత్వం అందులో భాగస్వామి కాగూడదని, జెకోస్లోవేకియాతో స్నేహసంబంధాలు కల్గిఉండాలని, జెకోస్లోవేకియా ప్రజలయెడల సానుభూతి చూపిస్తూ తీర్మానించింది. ప్రజా

శక్తులతో కలిసి, ఫాసిస్టువ్యతిరేక కూటమిలో నిలబడి, పోలెండుప్రభుత్వం సోవియట్లతో ఒడంబడిక చేసుకోవాలని కోరింది.

ప్రభుత్వవర్గాలకు, ప్రజలు కళ్ళకు కనపడని పెద్ద భూస్వాములకు, ప్రభువులకు ప్రజాభిప్రాయం అంటే లెక్కలేదు. ప్రభుత్వవర్గాలు హిట్లర్ తో చేరి రోజురోజుకూ ఫాసిస్టుకుట్రలలో చేరిపోయినాయి.

చివరినిమిషం వరకు ప్రజానాయకులందరూ ఫాసిస్టువ్యతిరేక వుద్యమాన్ని బలపరుస్తూ వచ్చారు. రైతువుద్యమ నాయకుడైన 'విటోస్' 1938 చివరిలో యిచ్చిన ఆజ్ఞలు చూడండి. "మధ్యలో ఆగి లాభంలేదు. రైతు అంతా ముందుకు సాగిపోవాలి.... ఒక్క నిమిషాన్ని గూడావృధాచేయకండి. వృధాచేసేపక్షంలో రాబోయే విషమపరిస్థితులను అడ్డుకోలేరు. ప్రజాస్వామ్యాన్ని బలపరుచుటకై ఏమూలనుంచి ఎటువంటిసహాయం వచ్చిచేరినా స్వీకరించండి. గింజనుంచి పొట్టును ధైర్యంగా వేరుజేయండి మాటలు కట్టిపెట్టి కార్యాచరణకు దిగండి. ఫాసిస్టువ్యతిరేక శక్తులనన్నింటిని కూడగట్టి సమీకరించండి!"

రాబోయేయుద్ధాన్ని, ఫాసిస్టులు కాలత్రవ్వుతున్న యుద్ధాన్ని అరికట్టుటకై పోలెండుప్రజలు కృషిచేశారు. ప్రజలకు అండగా కొంతవరకు సైన్యంగూడా కదిలివచ్చింది. ఉదాహరణకు: 1938 జనవరి 5 వ తేదీన సీరాజ్ పట్టణంలో 15000 మంది రైతులు సమావేశమై ఫాసిస్టువ్యతిరేక ప్రదర్శనాలను జరిపినపుడు, పోలెండుసైనికులు ఆ ప్రదర్శనాలను ఆహ్వానించారని రైతుపత్రిక వ్రాసింది. 1939 ఏప్రియల్ 2 వ తేదీన 'జురాత్' అను పోలెండు పత్రిక: "రైతుసమస్య కేవలం ఒక సాంఘికసమస్యయే గాక, మిలిటరీప్రాముఖ్యత గల బలమైన వుద్యమంగా వృద్ధిఅవుతోంది" అని వ్రాసింది.

జర్మన్ఫాసిస్టులు యుద్ధాన్ని సమీపిస్తున్న కొలదీ, పోలెండు ఫాసిస్టువ్యతిరేక వుద్యమం బలవత్తరమైన ప్రజావుద్యమంగా వృద్ధిఅయింది. ఫాసిజాన్ని ద్వేషించి, ఎదుర్కొనుటకై సన్నాహమవుతున్న ప్రజల నెత్తిమీద ఫాసిస్టు పోలెండు ప్రభుత్వం నిరంకుశంగా పరిపాలిస్తూ వచ్చింది. 1939 లో యుద్ధం ప్రారంభమయేసరికి పోలెండు పరిస్థితులు యివి.

# 3. ప్రభుత్వవర్గాల రాజకీయాలు

1918 నవంబరు 11వ తేదీన పోలెండు స్వాతంత్ర్యం ప్రకటించ బడిందని తెలుసుకున్నాం. ఆనాటినుంచి పోలెండు ప్రభుత్వవర్గాలు, జాతీయ దురహంకారంతో మైనారిటీ జాతులను ఎలా హింసించిందీ, రైతాంగాన్ని ఎలా బాధించిందీ, ప్రజాఉద్యమాలను నాశనంగావించుటకు ఎలా ప్రయత్నిం చిందీ, చివరికి ఫాసిస్టు కుట్రలలోచేరి హిట్లరును ఎలా బలపరుస్తూవచ్చిందీ కొంతవరకు తెలుసుకున్నాం. ఇప్పుడు ప్రభుత్వవర్గాలయొక్క విదేశాంగ వైఖరినిగురించి వివరంగా తెలుసుకుందాం. 1918 నుంచి పోలెండు ప్రభుత్వవర్గాలు అనుసరించిన అపాయకరమైన విదేశ వైఖరి పోలెండు హిట్లర్ ఆక్రమణకిందికి పోవుటకు యెలా తోడ్పడిందీ, ప్రపంచాన్నంతా యుద్ధంలో ముంచి ప్రపంచాధిపత్యానికి కుట్రలుగావించిన ఫాసిస్టు సామ్రాజ్యవాదులకు యెలా సహాయపడిందీ తెలుసుకుందాం.

అంతవరకూ రష్యన్ జారు సామ్రాజ్యంలోవున్న పోలెండు స్వతంత్ర దేశమైనవెంటనే రష్యాలో నూతనంగా యేర్పడిన సోవియట్ ప్రభుత్వం పోలెండు స్వాతంత్ర్యాన్ని యెట్టి మినహాయింపులు లేకుండా గుర్తించింది (1918).

యుద్ధంలో 4 సంవత్సరాలు చిక్కుకుని, ఆర్థిక దుస్థితిలో చిక్కుకున్న పోలెండు స్వాతంత్ర్యం పొందగానే దేశ పునర్నిర్మాణానికి పూను కుని, సరిహద్దులలో స్నేహంగా ఉండుటకు సంసిద్ధంగా ఉన్న రాజ్యాలతో స్నేహ ఒడంబడికలు చేసుకోవలసియుంది. కాని పోలెండుప్రభుత్వం. ప్రభుత్వనాయకుడైన పిల్సుడిస్కీ ఆవిధంగా తృప్తిపడలేదు. దేశ ప్రజలను లెక్కచేయలేదు. దేశ ఆర్థిక దుస్థితి వారికి పట్టలేదు. సోవియట్ వ్యతిరేక యుద్ధానికి దిగింది పోలెండు ప్రభుత్వం. కారణం?

పోలిష్ జాతులకు చెందినంతవరకూ సరిహద్దులు కల్గివుండుటకు ఇష్టపడని జాతీయ దురహంకారవాదులు పోలెండులో వున్నారు. వారి ప్రేరేపణ ఒక కారణం. దానికంటె ప్రధానమైంది పోలెండుకు రష్యాకు స్నేహసంబంధాలు లేకుండాచేసి సోవియట్ ప్రభుత్వంమీదికి పోలెండు

ప్రభుత్వాన్ని ఉసిగొల్పుటకు సామ్రాజ్యవాదులందరూ బయటినుంచి ప్రయత్నిస్తూ సహాయంచేయుటకు ముందుకు రావడం. ఇది రెండవ కారణం.

జారు సామ్రాజ్యాన్ని కూలద్రోసి ఆ సామ్రాజ్య శిధిలాల మీద సోవియట్ సోషలిస్టు ప్రభుత్వం అప్పుడే బయలుదేరింది. అంతవరకూ ప్రపంచమంతా తమ ఆధిపత్యంక్రింద పాలించిన సామ్రాజ్యవాదులకు ఇది కంటకంగా కన్పించింది. సామ్రాజ్యవాదులకోట భేదించబడి రష్యాలో వారి సిద్ధాంతాలకు వ్యతిరేకిస్తూ నిర్మించబడిన సోవియట్ ప్రభుత్వాన్ని నాశనం చేయుటకై ప్రపంచంలోని సామ్రాజ్యవాద దేశాలన్నీకలిసి పని చేసినాయి. సోవియట్ యూనియన్‌మీద అన్ని దిక్కులనుంచి దాడి అకారణంగా ప్రారంభించినాయి. సోవియట్ ప్రభుత్వాన్ని అంకురంలోనే త్రుంచివేయుటకు ప్రపంచ సామ్రాజ్యవాదులు సాగించిన ఆక్రమదాడిలో ఈ పోలిష్ ప్రభుత్వంయొక్క దాడి ఒక భాగం. కాని చాలా ప్రాముఖ్యతగల భాగం. పోలెండు సోవియట్ సరిహద్దులను ఆనుకుని ఉండుట వల్ల సోవియట్ వ్యతిరేకదాడిలో ఒక ప్రధాన కేంద్రంగా పోలెండు వినియోగపడుతుందని ఫ్రెంచి, బ్రిటిష్, అమెరికన్ మొదలైన సామ్రాజ్యవాదులు ఆశించారు. వీరి ఆశలకు తగినట్లుగా పోలెండు ప్రభుత్వం తోడయింది. వర్గబాంధవ్యం కుదిరిపోయింది. సోవియట్ వ్యతిరేకదాడిని నడుపుటకు ముందుకువచ్చిన పిల్సుడిస్కీని సామ్రాజ్యవాద పత్రికలన్నీ ప్రపంచ రక్షకుడని మెచ్చుకుంటూ వ్రాసినాయి. బోల్షివిజంనుంచి ప్రపంచాన్ని (సామ్రాజ్యవాదాన్ని) రక్షించాలని సామ్రాజ్యవాదుల ఆశయం. పాపం!

1918 నవంబరు నుంచి 1920 సెప్టెంబరులో సోవియట్ ప్రభుత్వానికి - పోలెండుకు సంధి జరిగేవరకూ పోలిష్ ప్రజల ఆర్థిక అవస్థలు వర్ణించడానికి వీలులేదు. తిండి, గుడ్డలు లేక అంటువ్యాధులు, కరువులలో చిక్కుకుని బాధపడుతున్న పోలెండు ప్రజల మీదుగా పోలెండు ప్రభువులు, మిలటరీ బలాలు సోవియట్‌కు వ్యతిరేకంగా స్వారీచేసినాయి!

లండన్ ప్రభుత్వవర్గాలకు చెందిన పత్రిక 'టైమ్స్' ఇలావ్రాస్తోంది (1919 జనవరి 2): "యుద్ధకాలంలో పోలెండు దేశంలో మాన్చెస్టర్‌గా పరిగణించబడే 'లోడ్జ్' ఫ్యాక్టరీలన్నీ ధ్వంసం చేయబడినాయి. పనిలేక వేలకువేల కార్మికులు నిరుద్యోగులైనారు. వార్సా (ముఖ్యపట్టణం) లో

1918 డిశంబరు 29 వ తేదీన వీధులగుండా రక్తం ప్రవహించింది. పాలు లేక శిశువులు చచ్చిపోతున్నారని, తాను దర్శించిన బాలుర పాఠశాలలలో ఒకదానిలో ఉన్న 200 మంది బాలబాలికలలో ప్రతి ఒక్కరు క్షయరోగంతో బాధపడుతున్నారని ప్రధానమంత్రి అయిన పాడీరస్కీయొక్క భార్యయే పత్రికా విలేఖరులతో చెప్పింది"

1919 జూలై 7 వ తేదీన తిరిగి 'టైమ్స్' పత్రికలో అమెరికా నుంచి హూవర్ ఈ విధంగా ప్రకటించాడు: "పోలిష్‌ప్రజలకు అపారమైన సహాయం అవసరంగా ఉంది. ముడిసరుకులు, అప్పులమాట అలా ఉంచి, ప్రపంచంలో దయార్ద్ర హృదయం గలవారందరూ వెంటనే వార్సా పట్టణంలో చచ్చిపోతున్న శిశువుల పాలకొరకు వెంటనే సహాయం చేయండి!"

ఇంత ఘోరంగా ఉన్న పరిస్థితులలో ప్రభుత్వవర్గాలు సోవియట్ వ్యతిరేక యుద్ధానికి దిగినాయి. ప్రజలు, బిడ్డలు ఎలాపోతేనేం? తమవర్గ ప్రయోజనాలు, సామ్రాజ్యతృష్ణయే ప్రధానమైంది వీరికి!

దేశంలో పంటలన్నీ నాశనమయినవని, కరువు భయలుదేరిందని, అంటువ్యాధులు వ్యాపించినాయనీ, వైద్యసహాయం కావాలని విదేశ పత్రికలన్నీ ఘోషిస్తున్న రోజులు అవి. సంపత్తిలేకుండా సంక్షోభంలో చిక్కుకున్న పోలెండు ప్రభుత్వం, కేవలం విదేశ సామ్రాజ్యవాదుల సహాయంమీద ఆధారపడి ముందుకు దుమికింది; రక్తాన్ని ప్రవహింపజేసింది. సోవియట్‌ప్రజలకు చేసిన ద్రోహమేకాదు ఇది. తమ పోలిష్ ప్రజలకు గూడా మహాపకారం చేసింది పోలిష్‌ప్రభుత్వం.

ఇక మిలటరీవిషయం చూద్దాం. యుద్ధకాలంలో పోరాడిన సైన్యాలు శాంతిని కోరుతున్నాయి. 'సోవియట్ వ్యతిరేకదాడిలో పాల్గొనుటకు ఎవరు ముందుకు వచ్చి వలంటీరుగా చేరితే, అతన్ని సైనికుడుగా తీసుకున్నది ప్రభుత్వం. ఈ విధంగా 60,000 మందిని రిక్రూట్ చేసినట్లు 'టైమ్స్' పత్రిక వ్రాసింది. వీరికి ఆయుధసామగ్రియో? పోలెండు ప్రభుత్వానికి ఆనాడు ఉన్న ఆయుధసామగ్రి మొత్తం 14 విమానాలు, 70 మరఫిరంగులు అని ఆ బ్రిటిష్‌పత్రికయే 1918 డిసెంబరు 7 వ తేదీన వ్రాసింది: ఇక మిలటరీకి అవసరమైన దుస్తులు, బూట్స్, తుపాకులు ఏవీకూడా లేవు. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా సామ్రాజ్యవాదుల సహాయంమీద ఆధారపడి పోలెండు ప్రభుత్వం యుద్ధానికి దిగింది.

విదేశాలనుంచి ఆయుధసామగ్రి, ఆహారసామగ్రి పోలెండుకు దిగుమతి చేయబడింది. సోవియట్ వ్యతిరేక యుద్ధంలో పోలెండును పాల్గొనేటట్లు చేయాలంటే దేశంలో తిండిలేక బాధపడుతున్న పోలిష్ ప్రజలకు తిండిబెట్టుటగూడా అవసరమని 'టైమ్స్' పత్రిక వ్రాసింది. యునైటెడ్ స్టేట్స్‌నుంచిగూడా ఓడలలో సరుకులు వచ్చి దిగినాయి.

పోలిష్ జాతులున్నంతవరకే పోలెండు సరిహద్దులకు నిర్ణయించిన మిత్రమండలి ప్రభుత్వాలే, ఆ సరిహద్దులనుదాటి దురాక్రమణను సాగించుటకై పోలెండు ప్రభుత్వానికి సహాయం చేస్తున్నాయి!

రష్యాలో నూతనంగా ఏర్పడిన సోవియట్ ప్రజా ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు అంతర్యుద్ధాలు సాగిస్తున్న భూస్వాముల నాయకులైన రాంగెల్, డెనికిన్, కోల్చాక్కులుగూడా ఈ సోవియట్ వ్యతిరేకదాడితో కలిసి పనిచేయడం ప్రారంభించారు. సోవియట్ భూమిలోఉన్న వర్గవిరోధులు, సోవియట్‌కు బయటఉన్న సామ్రాజ్య ప్రభుత్వాలు కలిసి బలహీనంగాఉన్న సోవియట్ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని చూశారు. ఈ ప్రయత్నాలలో పోలెండు ప్రభుత్వవర్గాల పాత్ర క్షంతవ్యంకాదు.

అంతర్యుద్ధాలలో సోవియట్ ప్రభుత్వం గెలిచినా, బలహీనపడిన సోవియట్లను ఓడించి మిత్రమండలి ప్రభుత్వాల సహాయంతో పోలెండు జెండాను 1772 నాటి పోలిష్ సామ్రాజ్య సరిహద్దులవరకూ తీసుకువెళ్ళాలని పిల్సుడిస్కీ ఆశించాడు.

అందువల్ల సోవియట్ ప్రభుత్వం సూచించిన శాంతి షరతులను త్రోసివేసుకుంటూ పోలెండు సైన్యాలు సోవియట్‌భూమిలో జొరబడ్డాయి. బలహీన స్థితిలో ఉన్నప్పటికీ రెడ్‌ఆర్మీ, దేశంలోని విద్రోహాలను నాశనంగావిస్తూ, విజయాలను పొందుతూ పోలెండు సైన్యాలను ఎదుర్కొంది.

1920 మార్చి 19 వ తేదీన, తమ గొంతెమ్మ కోర్కెలనన్నీ తెలియజేస్తూ 6 షరతులతో గూడిన సంధి సూచనలతో పోలెండు ప్రభుత్వం ముందుకు వచ్చింది. 1772 పోలెండు సరిహద్దులను గుర్తించాలని ఈ షరతుల సారాంశం. సోవియట్‌ప్రభుత్వం ఈకోర్కెలను నిరాకరించింది.

పోలెండు ప్రభుత్వం యొక్క 'న్యాయమైన' జాతీయ ఆశయాలను హర్షిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం అనేకసార్లు సందేశాలను పంపుతూ వచ్చింది. పోలెండుదాడి వార్తలు ప్రపంచమంతా వ్యాపించినాయి.

కాని 1920 మే 12 వ తేదీన బ్రిటిష్ ప్రజలు కళ్ళు తెరిచారు. లండన్‌లో తూర్పు ఇండియారేవులో బయలుదేరింది ఆందోళన. "జాలి జార్జి" అనే ఓడలోకి సరుకులు ఎక్కిస్తున్నారు హార్బర్ కూలీలు. ఆ సరుకులలో కొంతభాగం పోలెండుకు పోతున్నవని తెలుసుకుని, వెంటనే పని మానేశారు. పోలెండు ప్రభుత్వసహాయానికై పంపబడుతున్న ఆయుధ సామగ్రులు అవి. ఇక్కడ బయలుదేరిన కార్మికుల తిరుగుబాటు దేశమంతటా వ్యాపించింది. పార్లమెంటులో ప్రభుత్వ వైఖరిని గురించి ప్రశ్నలు బయలుదేరినాయి.

ఈలోపల పోలెండులో పోలిష్ సైన్యాల పరిస్థితి విషమించింది. రెడ్‌ఆర్మీ పోలిష్ సైన్యాన్ని వెనక్కు తరమడం ప్రారంభించింది. ఒక పట్టణం తరువాత ఒకటి ఖాళీచేసి పోలిష్ సైన్యాలు వెనక్కు పారిపోతున్నాయి. బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలకు కోపం హెచ్చింది. 1920 ఆగస్టు 3 వ తేదీన, బ్రిటిష్ విదేశాంగ మంత్రి అయిన లార్డ్‌కర్జన్ సోవియట్ ప్రభుత్వాన్ని బెదిరిస్తూ మాస్కోకు వర్తమానం పంపాడు. రెడ్ ఆర్మీ పోలెండులో పురోగమనం సాగిస్తే మిత్రమండలి ప్రభుత్వాలన్నీ పోలెండు ప్రభుత్వానికి సహాయం చేయకతప్పదని వార్త! అంతవరకు సోవియట్‌మీదికి పోలెండును ఉసిగొల్పిందెవరో !

కాని బ్రిటన్‌లో కార్మిక ఉద్యమం లేచి ఆందోళన మరీ యెక్కువైంది. 1920 అగస్టు 6 వ తేదీనే, బ్రిటిష్ లేబర్‌పార్టీ కార్యదర్శి అన్ని స్థానిక యూనిట్లకు తంతి పంపాడు.

"పోలెండు - సోవియట్ యుద్ధాన్ని వ్యాపింపచేయుటకు కుట్రలు జరుగుతున్నాయి. పోలెండుకు సహాయం యెంతమాత్రం పంపగూడదని; సైనికులనుగాని, ఆయుధ సామగ్రినిగాని పంపుట వెంటనే ఆపివేయాలని; వెంటనే సంధి ప్రయత్నాలు ప్రారంభించాలని, సోవియట్ ప్రభుత్వంతో వ్యాపార సంబంధాలను నిషేధిస్తూ ప్రవేశపెట్టిన ప్రతిబంధకాలను తొలగించాలని, వెంటనే సోవియట్‌తో వ్యాపార సంబంధాలను ప్రారంభించాలని అన్ని పట్టణాల్లో ఆందోళన చేయండి !! ప్రభుత్వ వైఖరిని ఖండిస్తూ తీర్మానాలుచేసి పంపండి !! "

వెంటనే దేశమంతటా బ్రిటన్‌లో బ్రహ్మాండమైన మీటింగులు, ప్రదర్శనాలు జరిగినాయి. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పార్లమెంటరీ

కమిటీ, లేబర్ పార్టీ కార్యనిర్వాహకవర్గం 9 వ తేదీన సమావేశమై, సోవియట్‌కు వ్యతిరేకంగా బ్రిటిష్ ప్రభుత్వంగాని, మిత్రమండలి గాని పోలెండును ఉసిగొల్పుతూ సహాయం చేసినయెడల, ఉత్పత్తినంతా స్తంభింపచేసే దేశ వ్యాపితసమ్మె ప్రారంభం కాగలదని, మానవజాతికి వ్యతిరేకంగా సాగించబడుతున్న ఆ సోవియట్ వ్యతిరేకయుద్ధాన్ని వెంటనే ఆపవలసిందని ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ తీర్మానం గావించారు. తీర్మానమే గాకుండా సమ్మెను జయప్రదంగా నడిపించుటకై వివిధ కేంద్రాల్లో వెంటనే సమ్మె కమిటీలను ఎన్నుకోవలసిందిగా యూనిట్లకన్నిటికి సూచనలు పంపారు.

ఈ సమ్మె నిర్ణయాలు వెంటనే అద్భుతమైన ఫలితాలకు దారి తీసినాయి. మరునాడు (ఆగస్టు 10) 'టైమ్స్' పత్రిక "సోవియట్‌కు వ్యతిరేకంగా యుద్ధంకావాలని కోరేవారు ఈ దేశంలో యెవరూ లేరు. దేశమంతా యుద్ధంతో సొమ్మసిలిపోతోంది. సోవియట్ వ్యతిరేక సూచనలను యెవరూ సహించరు" అని వ్రాసింది. 4 రోజులక్రిందట 'టైమ్స్' ధోరణికి, నేటి ధోరణికి ఎంత మార్పుకల్గింది, సమ్మె నిర్ణయాలవల్ల!

ఆరోజునే పార్లమెంటులో ప్రధానమంత్రి అయిన లాయడ్‌జార్జ్ ప్రకటన గావించాడు. సోవియట్ వ్యతిరేక యుద్ధం సమర్థనీయంగాదని, పోలిష్ జాతులతోగూడిన పోలెండు సరిహద్దులను మాత్రమే బ్రిటిష్ ప్రభుత్వం సమర్థిస్తుందని, వెంటనే శాంతిని చేసుకోవలసిందిగా పోలెండుకు కబుర్లుపంపారని, సోవియట్‌కు వ్యతిరేకంగా సహాయం పంపరని, ప్రభుత్వ వైఖరిని స్పష్టపరిచాడు!

పోలెండులో పరిస్థితులు ఎలా ఉన్నాయి? సోవియట్ సరిహద్దుల నుంచి పోలెండు సైన్యాలను తరుముకొని వచ్చిన రెడ్‌ఆర్మీ వార్సాపట్టణ గేట్లవరకూ వచ్చిచేరింది. కాని అంతదూరం పురోగమించిన తరువాత రెడ్‌ఆర్మీ పూర్తిగా అలసిపోయింది. ఆయుధసామగ్రులు అయిపోయినాయి. ఆహారపదార్థాల కొరత ఏర్పడింది. ఈ పరిస్థితులలో ఫ్రెంచిసైన్యాధిపతి అయిన వేగెండ్ నాయకత్వాన్న పోలెండు సైన్యాలు వార్సావద్ద రెడ్‌ఆర్మీ మీద దెబ్బతీసినాయి. రెడ్‌ఆర్మీ తిరోగమించింది. బలహీన స్థితిలో ఉన్న సోవియట్ ప్రభుత్వంనుంచి పోలెండు ప్రభుత్వం వీలైనంత లాభాన్ని పొందాలని ఆశించింది. సంధి సూచనలు ప్రారంభమయినాయి. 1921 మార్చి 18 వ తేదీన పోలెండుకు సోవియట్‌కు సంధి జరిగింది. ఆ సంధి

ప్రకారం, 1918 లో వెర్సేల్సు సంధి ప్రకారం నిర్ణయించబడిన వైశా కంటె 52,000 చదరపుమైళ్ళు ఎక్కువ వైశాల్యంగల భూమి పోలెండ్ చేరింది. 40 లక్షలు ఎక్కువమంది ప్రజలు పోలెండులోకి వచ్చా 3 కోట్ల బంగారపు రూబుల్స్ జార్ ప్రభుత్వంయొక్క బంగారపునిధిలో పోలెండుకు భాగంక్రింద ఇవ్వబడింది. జార్ కాలపునాటి రైలు మార్గాల లోనూ, రైలు బండ్లలోనూ పోలెండుకు వచ్చే భాగంక్రింద 290 లక్షల రూబుల్స్ విలువగల సామగ్రిని పోలెండుకు సోవియట్ ప్రభుత్వం ఇచ్చింది.

సోవియట్ ప్రభుత్వంయొక్క బలహీనతను అదును తీసుకుని అక్రమషరతులను అమలుపరిచింది పోలెండు ప్రభుత్వం. అన్యప్రాంతాలను (తెల్లరష్యా, పశ్చిమ యుక్రెయిన్) అక్రమించుకుంది. ప్రక్కనే ఉండి స్నేహాన్నికోరిన సోవియట్ ప్రభుత్వాన్ని త్రోసిరాజని, బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్, జపానీస్ మొదలైన సామ్రాజ్యవాదుల చేతుల్లో కీలుబొమ్మగా తయారైంది. పోలెండు ప్రభుత్వవర్గాల యొక్క విదేశాంగవైఖరి ఈ విధంగా ప్రారంభమయింది. ముందుముందు ఎలా పరిణమించిందీ గూడా చూద్దాం.

* * * *

సామ్రాజ్యవాదులందరూ కలిసి సాగించిన సోవియట్ వ్యతిరేకదాడి విఫలమయినా, సోవియట్ వ్యతిరేకత అంతరించలేదు. పైగా విజయం పొందిన సోవియట్ ప్రభుత్వం సామ్రాజ్యవాదులందరికీ మరింత కంటకంగా కన్పించింది. అందువల్ల యుద్ధానంతరం సోవియట్ వ్యతిరేక కుట్రలు మరింత ఎక్కువయినాయి. ఈ కుట్రలలో పోలెండు ప్రభుత్వ వర్గాలు గూడా ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తూ వచ్చినాయి.

పోలెండు పెద్ద శక్తివంతమైన దేశం కానప్పటికి సోవియట్ సరిహద్దులను ఆనుకొని ఉన్న దేశం అగుటవల్ల, పోలెండులో సోవియట్ వ్యతిరేక ప్రభుత్వం ఉండుట సామ్రాజ్యవాదులకు అనుకూలమని వెంటనే స్పష్టమవుతుంది. అనుకూలమేగాదు. అవసరంగూడా. అందువల్ల పోలెండు బూర్జువా, భూస్వాములను సామ్రాజ్యవాదులు బలపరుస్తూవచ్చారు. జర్మనీకి రష్యాకు మధ్య పోలెండు ఉండుటవల్ల, జర్మనీ తిరిగి తల ఎత్తకుండా చేయుటకు కూడా పోలెండును ఉపయోగించాలని చూశారు. యుద్ధానంతరం గెలుపొందిన యూరపియన్ దేశాల్లో ప్రధానమైన ఫ్రాన్సు

ఉ రెండు ఆశయాలతో (జర్మనీకి వ్యతిరేకంగానూ, రష్యన్ కమ్యూనిజా నికి వ్యతిరేకంగానూ) పోలెండు ప్రభుత్వమును బలపరిచింది. 1921 లో పోలెండుకు, ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు ఒడంబడిక జరిగింది. పోలెం డుకు అవసరమైన ఆయుధసామగ్రిని పంపించి, మిలటరీ శిక్షణ ఇచ్చి పోలెండు మిలటరీశక్తి వృద్ధిచేయుటకు సహాయపడింది ఫ్రాన్సు. 1923 లో 30 కోట్ల బంగారపు ఫ్రాంకులను పోలెండుకు అప్పుగా యిచ్చింది. 1924లో తిరిగి 3½ కోట్ల ఫ్రాంకులను వార్సాకుపంపింది ఫ్రెంచిప్రభుత్వం. ఈ సహాయంతో బాల్టిక్ సముద్రతీరాన పోలెండు ప్రభుత్వం గిడ్నియా రేవుపట్టణాన్ని నిర్మించింది. 1923వరకూ పోలెండును పరిపాలించిన పిల్సు డిస్కీ ప్రభుత్వం విదేశ సహాయంతోగూడా దేశ పరిస్థితులను చక్కబెట్ట లేకపోయింది. ఆర్థికంగా దేశం అధోగతిపాలైంది. ఈ పరిస్థితులలో 1923 లో పిల్సుడిస్కీచేత రాజీనామా పెట్టించారు. కాని తరువాత అధి కారంలోకివచ్చిన ప్రభుత్వాలు దేశాన్ని మరింత దుస్థితికి తీసుకొని వెళ్ళి నాయి. పిల్సుడిస్కీ 1926 లో ప్రభుత్వంమీద మిలిటరీదాడి సాగించి ప్రభుత్వాన్ని బలాత్కారంగా వశపరచుకొన్నాడు. అప్పటినుంచి పోలెం డులో మిలిటరీ నిరంకుశపరిపాలన ప్రారంభమైంది.

1930 నాటికి యూరపియన్ రాజకీయాల్లోనే గొప్ప మార్పులు ప్రారంభమైనాయి. సోవియట్ వ్యతిరేక ధోరణితో బ్రిటిన్, ఫ్రాన్సులు ఫాసిస్టు ప్రభుత్వాలను బలపరుస్తూ వచ్చినాయి. 1933 లో హిట్లర్ అధి కారంలోకి వచ్చినప్పటినుంచి పోలెండు విదేశాంగ వైఖరిలోగూడా మార్పు వచ్చింది. బలపడుతున్న హిట్లర్ ప్రభుత్వంవైపు మొగ్గింది. 1921 నుంచి ఫ్రాన్సుతో పెంపొందించుకున్న స్నేహ సంబంధం తగ్గింది. 1934 లో జర్మనీ - పోలెండులమధ్య 10 సంవత్సరాలు అమలులోవుండే నిరాక్రమణ ఒడంబడిక జరిగింది. తూర్పువైపుకు వ్యాపించాలని చూస్తున్న హిట్లర్‌కు పోలెండు మైత్రి అవసరమైంది. జర్మనీ - పోలెండు - జపాన్ - హంగేరీ - రుమేనియన్ దేశాలన్నిటినీ ఒక కూటమిగా తయారుచేసి, సోవియట్ వ్యతిరేక యుద్ధానికి ఉసిగొల్పాలని బ్రిటన్ ఫ్రాన్సులు ప్రయత్నిస్తూ వచ్చినాయి.

ఫాసిజాన్ని అరికట్టి ప్రపంచ శాంతిని కాపాడాలని 1933 నుంచి ప్రయత్నిస్తున్న సోవియట్‌ప్రభుత్వం ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని, ఐక్య సంఘటనను లేవదీసింది. తూర్పు - పడమర రెండుదిక్కులా జర్మనీని

అరికట్టుటకై యూరపియన్ రాజ్యాలన్నీ ఐక్యంకావాలని సూచనలుచేస్తూ వచ్చింది. తూర్పుప్రాంతంలో జర్మనీ. సోవియట్ యూనియన్, పోలెండ్సు, బాల్టిక్ దేశాలు, ఫిన్లండు, జెకొస్లోవేకియా కలసి ఒక ఒడంబడికను చేసు కుని దురాక్రమణను అరికట్టాలని 1934 లో సోవియట్ సూచన ఇచ్చింది. జర్మనీ, పోలెండు ప్రభుత్వాలు ఈ సూచనలకు అంగీకరించలేదంటే వారి దురాక్రమణ వైఖరి స్పష్టమవుతూనే ఉంది.

1935 వచ్చేసరికి పోలిష్ ప్రభుత్వం బహిరంగంగా తన ఆశ యాలను గురించి ప్రకటించుటకు వెరువలేదు. వ్లాడిమిర్ స్టూడ్నిక్ 1935 లో వ్రాసిన "పోలెండు రాజకీయ ఆశయాలు" అను గ్రంధంలో సోవి యట్ యూనియన్‌ను నాశనంచేయుటకై తమ ప్లానును విశదీకరించాడు.

"రష్యామీద జపాన్ దాడిచేయుటవల్ల పోలెండుకు లాభదాయకం. రష్యా - జపానులకు మధ్యజరిగే యుద్ధంలో పాల్గొనుటకై పోలెండు జర్మ నీతో ఐక్యంకావలసి యున్నది. 2 వ స్థానాన్ని ఆక్రమిస్తూన్న ఫ్రాన్సును లెక్కచేయనక్కరలేదు. పోలెండు - జర్మనీ కలిస్తే నూతన యూరపుకే పునాదులు వేయగలవు."

ఇక జర్మన్ ప్రభుత్వం తన సోవియట్ వ్యతిరేకతను ప్రతిప్రకటన లోనూ బహిరంగంగా తెలియపరుస్తూ వచ్చింది. జర్మన్ ఫాసిస్టు కోశాధి మంత్రిగా ఉన్న డాక్టరు షాట్ 1935 నవంబరులో ఈ దిగువ విధంగా చెప్పాడు :

"మా పశ్చిమసరిహద్దులలో మార్పులు కలుగజేయాలనే ఉద్దేశ్యం మాకు లేదు. త్వరలోనే జర్మనీ పోలెండులు కలిసి యుక్రెయిన్ రాష్ట్రాన్ని (సోవియట్) పంచుకోబోతున్నాయి. ప్రస్తుతం మట్టుకు బాల్టిక్‌దేశాల్లో మా బలాన్ని వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నిస్తున్నాం."

అదేకాలంలో జర్మనీ, పోలెండు, జపాన్ ప్రభుత్వాలమధ్య అవసర మైన రాజకీయ, మిలటరీ ఒడంబడికలు గూడా జరిగినాయి. పోలెండు ప్రభుత్వం ఫాసిస్టు కూటమిలో చేరిపోయింది. ఫాసిస్టులను బలపరుస్తూ వచ్చిన బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాదులయొక్క సోవియట్ వ్యతిరేక కుట్రలో చిక్కుకొనిపోయింది.

తరువాత ఏర్పడిన యూరపియన్ పరిస్థితులన్నీ పోలెండు ఉనికికే అపాయంగా పరిణమించినాయి. హిట్లర్ తనకూటమిని బలపరుచుకుంటూ దురాక్రమణలు ప్రారంభించాడు. స్పెయిన్‌లో ఫాసిస్టు ప్రభుత్వాన్ని నెల

కొల్పాడు; 1938 లో ఆస్ట్రియాను కబళించాడు; పోలెండు, హంగేరీల మద్దతుతో జెకోస్లొవేకియాలో కొంతభాగాన్ని ఆక్రమించాడు; 1939 లో జెకోస్లొవేకియాను పూర్తిగా మ్రింగాడు. హంగెరీకి రథీనియా రాష్ట్రం చిక్కింది. జెకోస్లొవేకియా పంపకంలో పోలెండుకు గూడా చిన్నభాగం దొరికింది. జెకోస్లొవేకియా అయిన తరువాత 1939 మార్చిలోనే మెమెల్‌ను (లిథూనియా) ఆక్రమించాడు హిట్లర్. ఇక పోలెండు మీదికే వస్తున్నాడు హిట్లర్. పోలెండు ప్రభుత్వవైఖరి మాత్రం మారలేదు ఇప్పటికి గూడా!

పోలెండుకు చెందిన కారిడర్‌ను, డాన్జిగ్ రేవుపట్టణం కావాలన్నాడు హిట్లరు. పోలెండుమీదికే వచ్చింది యుద్ధం. యుద్ధం క్రమేణా వ్యాపిస్తోంది. బ్రిటన్‌ఫ్రాన్సులు హిట్లర్ దురాక్రమణలకు మద్దత నిస్తూ ఉసిగొల్పుతున్నాయి. ఈ పరిస్థితులలో సోవియట్ ప్రభుత్వం కదిలింది. హిట్లర్‌ను అరికట్టుటకు అంతిమ ప్రయత్నాలు ప్రారంభించింది.

1939 లో జెకోస్లొవేకియా ఆక్రమణ జరిగిన వెంటనే సోవియట్ సూచనలు ప్రారంభమైనాయి. బ్రిటన్, ఫ్రాన్సు, సోవియట్ యూనియన్, పోలెండు, రుమేనియా, టర్కీలు కలిసి ముందు దురాక్రమణ జరుగకుండా ఒడంబడిక చేసుకొనుట అవసరమని మార్చి 18 వ తేదీన సోవియట్ ప్రభుత్వం సూచన ఇచ్చింది. అంత త్వరపడనవసరంలేదని ఛేంబర్లయిన్ జవాబు ఇచ్చాడు. పోలెండు ప్రభుత్వం ఈ సూచనను నిరాకరించింది.

డాన్జిగ్ ఆక్రమణ దగ్గరకు వచ్చేసరికి, మార్చి 31 వ తేదీన బ్రిటిష్ ప్రభుత్వం ఒక్కటే పోలెండుకు హామీ ఇచ్చింది! పోలెండుమీద దాడి ప్రారంభిస్తే బ్రిటన్ ఏంసహాయం చేయగలదు! సోవియట్ సహకారం లేకుండా పోలెండును రక్షించలేమని తెలిసిగూడా బ్రిటిష్ ప్రభుత్వం సోవియట్‌తో ఒడంబడికకు తయారుకాలేదు. సోవియట్‌తో ఒడంబడిక చేసుకొనమని పోలెండు ప్రభుత్వానికి సలహా ఇవ్వలేదు. ఫలితం ఏమంటే, ఎవరు సహాయంచేసినా, చేయకపోయినా, హిట్లర్ పోలెండుమీద పడితే, రెడ్ఆర్మీ పోలెండుకు సహాయంచేయుటకు సిద్ధంగా ఉన్నదని సూచించినపుడు, సోవియట్ల సహాయం తమకు ఆవసరంలేదని పోలెండు ప్రభుత్వం సూచనలను నిరాకరించింది!

తరువాత ఏప్రియల్ 15 వ తేదీన సోవియట్‌కు-బ్రిటనుకు మధ్య ప్రారంభమయిన సంప్రతింపులు 104 రోజులు జరిగినవని అందరికి తెలిసిందే. 104 రోజుల్లో, తన సూచనలు, జవాబులు, నిర్ణయాలు యిచ్చుటకు

సోవియట్ ప్రభుత్వం 20 రోజులు తీసుకుంది. మిగిలిన 84 రోజులు బ్రిటిష్‌ప్రభుత్వం వినియోగించుకుని, సంప్రతింపులను ఆలస్యంచేస్తూ, ఒడంబడికసూచనలను భగ్నంచేసిందని అందరికీ తెలిసినవిషయమే; సోవి యూనియన్‌తో బ్రిటన్, ఫ్రాన్సు, పోలెండులు ఫాసిస్టువ్యతిరేక ఒడంబడి కను చేసుకొనవని తేలిపోయింది. సోవియట్‌తో సంప్రతింపులు సాగిస్తూ బ్రిటన్ ప్రక్కనే హిట్లర్‌తో కుట్రలుచేస్తూ వచ్చింది. పోలెండు రక్షణ, ఫాసిస్టులను అరికట్టటం కాదు, ఆనాటి బ్రిటిష్‌ప్రభుత్వ ఆశయాలు; సోవి యట్ వ్యతిరేక యుద్ధానికి హిట్లర్‌ను వుసిగొల్పుటలో ఛేంబర్లయిన్ నిమ గ్నుడైపోయాడు: పోలెండు ప్రజలు ఫాసిస్టువ్యతిరేక ఒడంబడికకు గగ్గోలుపెడుతున్నా, పోలెండు ఫాసిస్టుప్రభుత్వం ప్రజలను లెక్కజేయక, దేశరక్షణ పాటించక, తనకు సహాయం చేయగల సోవియట్ ప్రజలను నిరాకరించి హిట్లర్‌ను దేశంమీదికి తీసుకొనివచ్చింది. ప్రభుత్వవర్గాల రాజకీయాల ఫలితం ఇది::

మిలటరీబలాలనుబట్టిచూస్తే, జర్మనీశక్తిముందు పోలెండు ఆగలేదని పోలెండుప్రభుత్వానికి తెలుసు. దురాక్రమణసమయంలో జర్మనీకి పశ్చిమాన ఉన్న బ్రిటన్, ఫ్రాన్సుల నుంచి సహాయంరావటం అసంభవమని పోలెండు ప్రభుత్వానికి తెలుసు. దురాక్రమణసమయంలో, పోలెండు రక్షణకై ఒకటే మార్గం ఉంది. ప్రక్కనే వున్న సోవియట్‌భూమి నుంచి ఆర్థికసహాయం, ఆహారసామగ్రి, మిలటరీసహాయం అన్నీ వస్తేనే పోలెండురక్షణ సాధ్య పడుతుంది. భూగోళపరిస్థితులను బట్టిచూసినా, మిలటరీబలాలను బట్టి చూసినా పోలెండు రక్షణకు ఇది ఒకటేమార్గం. అందువల్ల యూరప్‌లో ఏర్పడిన ఫాసిస్టుల దురాక్రమణస్థితిలో సోవియట్‌తో పరస్పరసహాయ ఒడంబడిక చేసుకొనుటవల్లనే పోలెండు రక్షించబడి యుండేది. ఒక పోలెండు మాత్రమేకాదు. అటువంటి ఒడంబడిక యూరప్‌నంతా రక్షించి యుండేది. పోలెండు నుంచి జర్మనీమీద దాడిచేసి, జర్మనీని ఓడించుట సులభం. పోలెండు పశ్చిమసరిహద్దుల నుంచి బెర్లిన్‌కు 100 మైళ్లు; బ్రెస్లోకు 37; స్టెటిన్‌కు 67, మాగ్డిబర్గుకు 187 మైళ్ళు. ఈవిధంగా జర్మన్ పట్టణాలను, పారిశ్రామిక కేంద్రాలను ధ్వంసంచేయుట సులభమయి వుండేది. పోలెండులోని పోసెన్ రాష్ట్రంనుంచి 2 గంటలలో విమానాలు వెళ్ళి జర్మనీలో ఏపట్టణాన్ని అయినా నాశనంచేసి వచ్చేవి. ఫాసిస్టులకువ్యతి రేకంగా బ్రిటన్, ఫ్రాన్సు, పోలెండు, సోవియట్‌యూనియన్ ఐక్యమయి

వుండినయెడల జర్మన్ ఫాసిస్టులను నాశనంజేయుటలో పోలెండు ప్రధాన రంగంగా వినియోగపడేది. పోలెండు స్వాతంత్ర్యం రక్షించబడేది. పోలెండు గొప్పపాత్రను వహించి ఉండేది.

కాని పోలెండు ప్రభుత్వవర్గాలకు భూగోళపరిస్థితులుగాని, మిలిటరీ బలాలుగాని, దేశప్రజల రక్షణగాని పెద్దవిషయం కాదు. వారి నిర్ణయాలన్నీ వారి వర్గరాజకీయాలను బట్టి నడిచినాయి. యీ విషయాలన్నీ తెలిసిన బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాదులకు కూడా సోవియట్ వ్యతిరేక రాజకీయాలే ప్రధానమైనాయి. పోలెండు ప్రభుత్వవర్గాలు, విదేశ సామ్రాజ్యవాదులు—ఇద్దరూ పోలెండు ప్రజలను లెక్క జేయలేదు; పోలెండు స్వాతంత్ర్యంగాని, యూరపియన్ ప్రజల స్వాతంత్ర్యంగాని పాటించలేదు. యుద్ధం వ్యాపిస్తుందని జంకలేదు. సోవియట్ వ్యతిరేకధోరణితో ఇతర దేశాలతోపాటు పోలెండునుగూడా హిట్లరుకు అహుతిచేసి, పోలెండు ప్రజలకు, యూరపియన్ ప్రజలకు ద్రోహంచేశారు!

# 4. రెడ్ ఆర్మీ ప్రవేశించింది!

పోలెండు ప్రభుత్వవర్గాల విదేశ రాజకీయాల ఫలితంగా హిట్లర్ 1939 సెప్టెంబర్ 1 వ తేదీన పోలెండులో ప్రవేశించాడని తెలుసుకున్నాం. వెంటనే పోలెండుప్రభుత్వం లండన్‌కు పారిపోవుట, 17 రోజుల్లో పోలెండు కూలిపోవుట మనకుతెలిసిన విషయమే. కాని పోలెండు ప్రభుత్వంలేకుండా పోయినప్పుడుగూడా సెప్టెంబరు 17 వ తేదీన తూర్పునుంచి రెడ్ ఆర్మీ పోలెండులోకి ఎందుకు ప్రవేశించింది? అనే విషయాన్ని ఇప్పుడు పరిశీలిద్దాం.

ఈ విషయాన్నిగురించి అనేక అపోహలు కల్గినవని యిదివరకే చెప్పబడింది. జర్మనీ-రష్యాలు కలిసి పోలెండును పంచుకున్నవనీ: ఆగష్టులో జరిగిన సోవియట్ - జర్మన్ ఒడంబడికలోనే యీ పంపకం నిర్ణయించ బడిందని; రెడ్ ఆర్మీ ప్రవేశించనియెడల పోలెండుసైన్యాలు ధైర్యంగా నిల బడి నాజీలను యెదుర్కొని ఉండేవని; రెడ్ ఆర్మీ పోలెండు వెన్నులో వెనుకనుంచి పొడిచిందని; సోవియట్ సోషలిస్టు ప్రభుత్వం పోలెండు ఆక్రమణకు దిగిందని; అదిగూడా ఒక సామ్రాజ్యవాదమే నని అనేక రకాల అపోహలు బయలుదేరినాయి. అందువల్ల ఈ విషయాన్నిగురించి శ్రద్ధగా పరిశీలించవలసియుంది.

(1) సోవియటు సైన్యాలు యే పరిస్థితులలో పోలెండులో ప్రవే శించినాయి? పోలెండు ప్రభుత్వంలేకుండా పోయింది. ప్రభుత్వం దేశాన్ని వదలిపెట్టి పారిపోయింది. సెప్టెంబరు 17 వ తేదీనాటికి శత్రువును యెది రించే శక్తిగూడా పూర్తిగా క్షీణించి, పోలెండు సైన్యాలు చెల్లాచెదరై శత్రువుకు లొంగిపోతున్నాయి. రెడ్ ఆర్మీ ప్రవేశించిన సెప్టెంబరు 17 వ తేదీన 'టైమ్స్' (బ్రిటిష్ పత్రిక) యేమివ్రాసిందో చూడండి: "వారం రోజులక్రిందట ఒక ప్లానుప్రకారం తిరోగమిస్తున్న పోలిష్ సైన్యాలు ఇప్పుడు చెల్లాచెదరై పారిపోతున్నాయి. పోలిష్ యుద్ధరంగమంతా నాశన మైందనే చెప్పవచ్చు. పోలెండుకు చెందిన 15 లక్షల సైన్యంలో మిగిలిన కొద్దికొద్ది సైనికులను తుడిచివేయుటమాత్రమే జర్మన్లకు మిగిలినపని". 2 రోజులతరువాత ఆ పత్రికయే "రెడ్ ఆర్మీ పోలెండులో ప్రవేశించేసరికి పోలెండు యుద్ధం సాంతమైంది: సైన్యాలన్నీ చెల్లాచెదరై శత్రువుకు

లొంగిపోయి ఉన్నాయి". అందువల్ల ప్రభుత్వంలేని సమయంలో ఆ దేశ ప్రజల పోరాటం ఆఖరికి వచ్చిన తరువాత, రెడ్ఆర్మీ ప్రవేశించిందని స్పష్టంగా రుజువయింది. అందువల్ల రెడ్ఆర్మీ ప్రవేశించినందువల్ల పోలెండు సైన్యాలు పోరాటాన్ని ఆపివేయవలసివచ్చిందని చెప్పుట పొరపాటు. యదార్ధ పరిస్థితులను గుర్తించకుండా చెప్పుటయే అవుతుంది. పైగా సోవియట్ సైన్యాలను యెదుర్కొనుటకు ఒక్క పోలెండు సైనికుడుగూడా యే యుద్ధరంగంనుంచిగూడా రాలేదనే విషయం చరిత్ర నిరూపిస్తోంది.

(2) పోలెండు పంపకం విషయం సోవియట్ - జర్మన్ ఒడంబడిక లోనే నిర్ణయించబడిందనే నిందను పరిశీలిద్దాం.

సోవియట్ - జర్మన్ ఒడంబడిక అనంతరం జరిగిన ఘటనలను బట్టి చూస్తే ఇట్టి రహస్య అంగీకారం జరిగి యుండుటకు వీలులేదని తెలుస్తుంది.

సోవియట్ సైన్యాలు పోలెండులో ఎట్టి సమయంలో ప్రవేశించినదీ జాగ్రత్తగా గుర్తించండి. జర్మనులకు సహాయం చేయదలచుకుంటే, సెప్టెంబరు 17 వ తేదీకి బదులు అంతకుపూర్వమే ప్రవేశించిన యెడల పోలెండు 17 రోజులకు ముందే కూలిపోయి ఉండేది. సెప్టెంబరు 17 వ తేదీవరకూ రెడ్ఆర్మీ ఆగవలసిన అవసరం యేమిటి ? 17 వ తేదీ గాకుండా మరొక 24 గంటలు ఆలస్యం చేసియుంటే, హిట్లరు మరికొంత ప్రాంతాన్ని ఆక్రమించి ఉండేవాడు ; అందువల్ల జర్మనులకు సహాయంగా గాకుండా జర్మన్ప్లానులను భగ్నంచేస్తూ సరియైన కాలంలో రెడ్ఆర్మీ ముందుకు సాగింది. అంతేగాక, సెప్టెంబరు 17 వ తేదీనాటికి పోలెండు ప్రభుత్వమే గాక, పోరాటంగూడా సమసిపోయిందని గమనించాం. అందువల్ల తమ దేశ ప్రజలైన తెల్లరష్యన్లను, పశ్చిమ యుక్రేనియన్లను హిట్లర్ బారినుండి రక్షించుటకే రెడ్ఆర్మీ సరిహద్దులు దాటిందని స్పష్టపడుతోంది.

అటువంటి రహస్యషరతులేవీ ఒడంబడికలో లేవని సోవియట్ విదేశాంగమంత్రి మొలటోవ్ స్పష్టపరిచాడు. అటువంటి షరతులే ఉంటే రహస్యంగా దాచియుంచవలసిన అవసరం సోవియట్ ప్రభుత్వానికి లేదు.

రహస్యషరతు లేవీలేవని బ్రిటిష్ ధనికవర్గ పత్రికలు, మిలటరీ వ్యాఖ్యాతలుగూడా క్రమేణా అంగీకరించుటయేగాక, రెడ్ఆర్మీ పోలెండు

సరిహద్దులను దాటుటవల్ల హిట్లర్ ఆశయాలకు అంతవరకూ తాకని దెబ్బ తగిలిందని అభిప్రాయపడ్డారు.

(3) పోలెండుకు — సోవియట్‌కు 1932 లో జరిగిన నిరాక్రమణ ఒడంబడికను పాటించకుండా రెడ్‌ఆర్మీ పోలెండుమీద దాడిచేసిందని ఒక అపోహ। హిట్లరు దురాక్రమణదారుడే. కాని దురాక్రమణను గర్హించే సోవియట్ సోషలిస్టు ప్రభుత్వం పోలెండులో ప్రవేశింపవలసిన అగత్య మేమిటి ? అని కొందరి అనుమానం.

మొదటి విషయం సెప్టెంబరు 17 వ తేదీకి పోలెండులో ప్రభుత్వం లేదు. అందువల్ల సోవియట్ ప్రభుత్వం ఎవరిమీద నేరం చేసినట్లు పరిగణించాలి ? ఆ విషయం అలా ఉంచి ప్రఖ్యాత బూర్జువా రాజ్యాంగచట్ట శాస్త్రజ్ఞుడైన ప్రొఫెసర్ కీత్ ఈ విషయాన్ని గురించి ఏమి చెప్పాడో చూడండి :

"జెకోస్లొవేకియాను హిట్లరు ఆక్రమించిన సమయంలో నిరాక్రమణ ఒడంబడికను పాటించకుండా పోలెండు ప్రభుత్వంగూడా జెకోస్లొవేకియా శత్రువులలోచేరి భాగం పంచుకుంది. ఆసమయంలో సోవియట్‌ప్రభుత్వం పోలెండుప్రభుత్వాన్ని హెచ్చరించింది. జెకోస్లొవేకియా రక్షణకు వ్యతిరేకంగా పోలెండు ప్రవర్తించినయెడల తనకు, పోలెండుకు మధ్య గల నిరాక్రమణసంధికి విలువ ఉండజాలదని సోవియట్‌ప్రభుత్వం అప్పుడే స్పష్టపరిచింది. (ఇతర ప్రభుత్వాలతోపాటు పోలెండుగూడా జెకోస్లొవేకియా స్వాతంత్ర్యానికి హామీ ఇచ్చిందని మరచిపోగూడదు)"

"1935లో అబిసీనియాకు ప్రాణప్ర ద్రోహంచేసి ఇటలీకి ఒప్పచెప్పింది. వెర్సైల్స్‌సంధిని భగ్నంచేయుటకై హిట్లరుకు మనమే సహాయం చేశాం. అక్రమంగా జరిగిన అబిసీనియా ఆక్రమణ విషయంలో ఇటలీని మనం గుర్తించాం. సిగ్గులేకుండా జెకోస్లొవేకియాను హిట్లర్‌కు ఒప్పగించాం. మనం అవలంబిస్తున్న నీతిసూత్రాలకంటే అధికంగా ఇతరులనుంచి ఆశించుటకు మనకు ఏం హక్కుంది?" అనిబ్రిటిష్ రాజ్యాంగవేత్తఅడుగుతున్నాడు.

4. సోవియట్ యూనియన్‌గూడా సామ్రాజ్యవాద దేశమే। పోలెండులో కొంతభాగాన్ని ఆక్రమించింది। అన్నారు. ఈ అపోహకు ఎంత మాత్రం ఆధారంలేదు. 20 సంవత్సరాలకు పైగా సామ్రాజ్యవాద సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూ నిలబడి సోషలిస్టు సమాజాన్ని నిర్మిస్తూ వచ్చిన సోవి

యట్ భూమి ఈనాడు సామ్రాజ్యవాదుల దృక్పథంలో పెట్టుబడిదారీ దేశంగా కన్పిస్తోంది! అయినా ఈ అపోహనుగూడా పరిశీలిద్దాం.

రెడ్ఆర్మీ సరిహద్దులను దాడి పశ్చిమ తెల్లరష్యాను, పశ్చిమ యుక్రెయిన్ రాష్ట్రాలను ఆక్రమించి యుండకపోతే ఈప్రాంతాలకు ఏ గతిపట్టేది? ఈప్రాంతాలలో నివసించే ప్రజలుఎవరు? ఈప్రజలు పోలెండులో ఉండటం ఎలా సంభవించింది? రెడ్ఆర్మీ గనక సరుహద్దులను దాటకపోయి ఉన్న యెడల సోవియట్ యూనియన్ ఏ స్థితిలో ఉండేది. ఈ దృక్పథాలనుంచి ఈసమస్యను చూడవలసి యున్నది.

ఈ ప్రాంతాలను (పశ్చిమ తెల్లరష్యా, పశ్చిమ యుక్రెయిన్) రెడ్ ఆర్మీ ఆక్రమించి యుండకపోతే, హిట్లర్ ఆక్రమించేవాడు. హిట్లర్ ఆక్రమణక్రింద ఇక్కడిప్రజల అవస్థలు ఎలా ఉండేవో వర్ణించనక్కర లేదు. వారిలో గూడా అధికసంఖ్యాకులుగా ఉన్న యూదులను హిట్లర్ చీల్చి చెండాడేవాడు. ప్రత్యేకంగాయూదుల విషయంలోనూ, మైనారిటీ జాతుల విషయంలోనూ సోవియట్ప్రభుత్వం చూపిన ఆదరాభిమానాలు ప్రపంచానికంతకు తెలిసినవిషయమే.అటువంటి సోవియట్ప్రభుత్వం వీరిని హిట్లర్ బారినుంచి రక్షించిందంటే హర్షించదగిన విషయంకాదా? 'కీత్' గూడా రెడ్ఆర్మీ చర్యను సమర్థించాడన్న విషయం గుర్తించాలి.

ఇక ఈ ప్రాంతాలలో ఉండే ప్రజలనుగురించి ఇదివరకే తెలుసుకున్నాం. పోలెండుప్రభుత్వం ఈ ప్రాంతాలను అక్రమంగా ఎలా స్వాధీన పరుచుకుందో, అక్కడ నివసించే మైనారిటీ జాతులను నాగరికతా సాంప్రదాయాలకు, జాతిసమితి నియమాలకు వ్యతిరేకంగా ఎలా హింసించిందో గూడా చూశాం. ఆ చరిత్ర అంతా తెలుసుకొన్న తరువాత, సోవియట్ ప్రభుత్వం తిరిగి తన ప్రజలను తనదేశంలో కలుపుకుందంటే సామ్రాజ్యవాదులు తప్ప ప్రతివారు న్యాయంగా సమర్థించవలసియున్నది. దురాక్రమణలంటే బొత్తిగా తెలియని సామ్రాజ్యవాదులకు మాత్రం కష్టంగానే ఉంటుంది పాపం!

పై కారణాలనుబట్టి హిట్లర్ ముందుకు దుమికి ఈ ప్రాంతాలను గూడా ఆక్రమించే ముందే, రెడ్ఆర్మీ కదిలింది. హిట్లర్ ఈ ప్రాంతాలను గూడా ఆక్రమించియుంటే, రుమేనియా సరిహద్దుమీదికి, నల్లసముద్రం దగ్గరికి, బాల్కాన్ దేశాల పరిసరాలకు నాజీసైన్యాలు అప్పుడే చేరి ఉండేవనే విషయం మరిచిపోరాదు.

సోవియట్ భూమి రక్షణదృక్పథంనుంచి ఈ చర్య అవసరమైంది. బద్ధశత్రువైన ఫాసిజాన్ని తన సరిహద్దులమీదికి తెచ్చుకొనుటకు సోవియట్ ప్రజలు ఎప్పుడూ అంగీకరించరు. సోవియట్ యూనియన్ దరిదాపుకు రాకుండా, పోలెండుకు సహాయంచేసి, హిట్లర్‌ను ఎదుర్కొనే అవకాశాన్ని పోలెండు ప్రభుత్వం (సోవియట్ సహాయం నిరాకరించుట ద్వారా) నిరాకరించింది. ఇక పోలెండు హిట్లర్ వశమైన తరువాత స్వదేశరక్షణకై ప్రక్కకు కదిలి, దూరంగా ఉండగానే నిప్పును ఆర్పివేయవలసి వచ్చింది. 1939 అక్టోబర్ 1 వ తేదీన, రేడియోలో మాట్లాడుతూ, రెడ్‌ఆర్మీ చర్యను చర్చిల్ సమర్థించాల్సి వచ్చింది. నాజీ దుండగీడులనుంచి రక్షించుకొనుటకై ఈ చర్య అవసరమని చర్చిల్ గూడా చెప్పవలసి వచ్చింది ! కేవలం తన ఉనికికి, భద్రతకు సోవియట్ ప్రభుత్వం ఈ చర్యను తీసికొనుట న్యాయమైనదని పార్లమెంటులో సెప్టెంబరు 20 వ తేదీన బూత్‌బీ అను ప్రభుత్వవర్గ సభ్యుడే అంగీకరించాడు.

రెడ్‌ఆర్మీ కదిలి ఈ ప్రాంతాలను ఆక్రమించుటవల్ల కల్గిన ఫలితం యేమిటి ? నాజీసైన్యాలంటే భయపడకుండా ఎదుర్కొనగల కొత్తరకం సైన్యం ఇప్పుడు నాజీసైన్యాల ప్రక్కన వచ్చి నిలబడింది. రెడ్‌ఆర్మీతో ఆనాడు పోరాటానికి దిగుటకు హిట్లరుకు గుండెలులేవు. సోవియట్ - జర్మన్ యుద్ధరంగం లేకుండాచేసుకొని పశ్చిమానికి తిరిగి తన సామ్రాజ్యవాద ఆశయాలను నెరవేర్చుకోవాలని అనుకొన్న హిట్లరుకు, రెడ్‌ఆర్మీ కదలి ఈ ప్రాంతాలను ఆక్రమించుకొని ప్రక్కలోబల్లెంగా తయారైంది. అంతేగాదు; బాల్టిక్ దేశాలమీద తన ఆట సాగించుటకుకూడా రెడ్‌ఆర్మీ చర్యవల్ల అవకాశాలు తగ్గినాయి. తరువాత చరిత్ర అంతా రెడ్‌ఆర్మీచర్యను సమర్థించింది. కాని సామ్రాజ్యవాదులకు చరిత్రతో అవసరంలేదు. చరిత్ర ఒకవైపు చూపిస్తుంటే, సామ్రాజ్యవాదులు దానికి వ్యతిరేకంగా, సోవియట్ వ్యతిరేక ప్రచారం సాగిస్తూ, యుద్ధం ప్రారంభమైనతరువాతగూడా హిట్లరును రష్యామీదికి ఉసిగొల్పాలని ప్రయత్నించారని అందరికి తెలిసిన విషయమే, పోలెండు ఆక్రమణ తరువాత, హిట్లరును రష్యామీదకు రెచ్చగొట్టుటకు సామ్రాజ్యవాదులు చేసిన అబద్ధ ప్రచారంలో, ఇదిగూడా (రెడ్‌ఆర్మీ దురాక్రమణ !) ఒకభాగం.

# 5. లండన్‌లో పోలిష్‌ప్రభుత్వం

హిట్లర్ పోలెండును ఆక్రమించే సమయంలో పోలిష్‌ప్రభుత్వం లండన్‌వైపుకు పలాయనమైందని తెలుసుకున్నాం. అప్పటినుంచి జెనరల్ సికోరస్కీ నాయకత్వం క్రింద పోలెండుప్రభుత్వం ఏర్పడి లండన్‌లో వుంటూవచ్చింది. 1943 లో సికోరస్కీ మరణించిన తరువాత జనరల్ సోసోస్నోవస్కీ నాయకత్వంక్రింద పోలెండు ప్రభుత్వం ఏర్పడింది. అయితే స్వదేశాన్ని వదిలిపెట్టి లండన్‌లోకూర్చున్న పోలిష్‌ప్రభుత్వం అప్పటినుంచి ఏంచేస్తోంది ? ప్రజలను, దేశస్వాతంత్ర్యాన్ని లెక్కజేయక స్వదేశాన్ని హిట్లర్‌కు అప్పజెప్పిన పోలిష్ ప్రభుత్వపు వైఖరిలో ఇప్పుడేమైనా మార్పు వచ్చిందా ? తరువాత జరిగిన చరిత్రనుబట్టి చూస్తే వీరి వైఖరిలో మార్పు లేమీ లేకపోగా, బ్రిటన్‌లోనూ, అమెరికాలోనూ ఫాసిస్టులను బలపరిచే మతాలమద్దతతో, మరింత ఎక్కువగా సోవియట్ వ్యతిరేక కుట్రలను పన్నసాగింది. లండన్‌లోని పోలిష్ ప్రభుత్వవైఖరి జర్మన్‌ఫాసిస్టులకు అనుకూలంగా పరిణమించింది.

1941 జూన్ 22 వ తేదీన హిట్లర్ సోవియట్‌యూనియన్‌మీద దాడి ప్రారంభించేవరకూ లండన్‌లో ఉన్న పోలిష్‌ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వంమీద ఎన్నో నిందలువేస్తూ దుమ్మెత్తిపోసింది. సోవియట్ ప్రభుత్వం పోలెండుమీద దురాక్రమణ సాగించిందని, వెన్నులో పొడిచిం దని, హిట్లర్‌కు - స్టాలిన్‌కు భేదంలేదని, పోలెండుకు చెందిన (!) భూము లను సోవియట్ ప్రభుత్వం ఆక్రమించిందని అనేకరకాలుగా సోవియట్ వ్యతిరేక ప్రచారంసాగించింది. బ్రిటన్‌లో ఉండే సోవియట్ వ్యతిరేకులు ఈ ప్రచారానికి మద్దతనిచ్చారు.

కాని 1941 జూన్‌లో రష్యామీద జర్మన్ దాడి ప్రారంభంకాగానే బ్రిటిష్, అమెరికన్ ప్రభుత్వాలతోపాటు, వాటి రక్షణలో ఉన్న పోలెండు ప్రభుత్వంగూడా సోవియట్‌తో ఫాసిస్టువ్యతిరేక ఒడంబడిక చేసుకోవలసి వచ్చింది. 1941 జులై 30 వ తేదీన పోలెండుకు-సోవియట్‌కు మధ్య ఒడం బడిక జరిగింది. ఒడంబడిక జరిగిందేకాని, పోలిష్ ప్రభుత్వములో

ఉన్నవారందరికి సోవియట్ అంటే ఇప్పటికి గూడా ద్వేషమే. ప్రభుత్వ సభ్యుడైన సోస్నోవస్కీ ఒడంబడికపట్ల అసమ్మతి తెలుపుతూ రాజీనామా యిచ్చాడు. కరడుగట్టిన ఫాసిస్టులలో ఒకడు సోస్నోవస్కీ అనుటకు సందేహం ఏముంది? కాని 1943 లో సికోరస్కీ మరణించిన తరువాత లండన్‌లోని పోలిష్ ప్రభుత్వానికి నాయకుడుగా వచ్చింది ఇతడే నని గుర్తుపెట్టుకొనుట అవసరం.

పోలెండుకు బయట ఉన్న పోలిష్ ప్రజలను సమీకరించి, ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పాల్గొనుటకై సైన్యాలను నిర్మించుట లండన్ లోని పోలిష్ ప్రభుత్వంయొక్క కార్యక్రమంలో ఒక భాగం ఈ విష యంలో రష్యాలో ఉన్న పోలిష్ పౌరులతోగూడిన ఒక సైన్యాన్ని నిర్మించాలని 1941 ఆగస్టులో పోలిష్ ప్రభుత్వం, సోవియట్ ప్రభుత్వం అంగీకరించినాయి. ఈ సైన్యంలో 30000 మంది సైనికులు ఉండేట్లు, సమీకరణ జరిగినవెంటవెంటనే దళంతరువాత దళాన్ని సోవియట్-జర్మన్ యుద్ధరంగానికి పంపి ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో పాల్గొనేట్లు చేయు టకుగూడా అంగీకరించబడింది."

సోవియట్ ప్రభుత్వం వెంటనే పోలిష్ సైన్య నిర్మాణానికి అవసర మైన ఏర్పాట్లు గావించింది. ఈ సైన్య నిర్మాణానికి ఖర్చులకిర్రింద, వడ్డీ లేకుండా 6½ కోట్ల రూబుల్స్‌ను వెంటనే పోలిష్ ప్రభుత్వానికి అప్పుగా ఇచ్చింది. 1942 జనవరిలో ఈ మొత్తాన్ని 30 కోట్లకు హెచ్చించింది. ఇదిగాకుండా సైన్యాధిపతుల అలవెన్సులకిర్రింద 1½ కోట్ల రూబుల్సును ఉచితంగా సోవియట్ ప్రభుత్వం గ్రాంట్‌చేసింది.

పోలిష్ సైన్యంలో సైనికుల సంఖ్య 30000 నుంచి 96000 కు హెచ్చించమని పోలిష్ ప్రభుత్వం 1941 డిసెంబరులో కోరినప్పుడు సోవియట్ ప్రభుత్వం వెంటనే అంగీకరించింది. ఈ నిర్ణయ ఫలితంగా సోవియట్ యూనియన్‌లో 6 పోలిష్ దళాలు నిర్మించబడ్డాయి. ఇవేగా కుండా, రిజర్వు ఆఫీసర్ల స్కూళ్ళలో మొదట అనుకున్నట్లుగా 3000గాక 40000 మంది రిజర్వు ఆఫీసర్ల స్కూళ్ళలో తరిఫీదు పొందుతూవచ్చారు.

తరువాత పోలిష్ ప్రభుత్వం కోరినట్లుగా ప్రధానంగా శీతోష్ణస్థితి కారణాలనుబట్టి (1), సోవియట్ యూనియన్‌లోని దక్షిణ ప్రాంతాలకు పోలిష్ సైన్యాలు పంపబడినాయి.

యుద్ధకాలంలో ఉండే కష్టాలనన్నిటిని యెదుర్కొంటూ 1942 ఫిబ్రవరినాటికి 73415 సైనికులతోగూడిన పోలిష్‌దళాలు నిర్మించబడ్డాయి. ఈవిధంగా శిక్షణపొంది తయారుగా ఉన్నదళాలను యుద్ధరంగానికి పంపే విషయంలో ఎప్పటికప్పుడు వాయిదాలువేస్తూ, ఒడంబడికకు వ్యతిరేకంగా పోలిష్‌ప్రభుత్వం కాలయాపనచేయటం ప్రారంభించింది.

పోలిష్ సైన్యాల నిర్మాణాన్ని ప్రారంభించినపుడు, 1941 అక్టోబరు 1 వ తేదీకి తయారు అయిన దళాలు సోవియట్ - జర్మన్ యుద్ధరంగానికి పంపబడాలని అంగీకరించబడింది. కాని నిర్మాణం కొంత ఆలశ్యమైందని అనుకున్నా తరువాత కొంతకాలానికైనా ఈ దళాలు యుద్ధరంగానికి వెళ్ళ వలసి యున్నప్పటికి, పోలిష్ మిలటరీ సైన్యాధిపతులు ఆ విషయాన్ని గురించి మాట్లాడటమే మానేశారు.

ఆ పరిస్థితులలో సోవియట్ ప్రభుత్వమే కదిలి అప్పటికి తయా రుగావున్న 5 వ పోలిష్‌దళాన్ని వెంటనే హిట్లరుకు వ్యతిరేకంగా యుద్ధ రంగానికి పంపమని 1942 ఫిబ్రవరిలో పోలిష్ ప్రభుత్వాన్ని కోరింది. పోలిష్ ప్రభుత్వంతరపున మిలటరీ కమాండరుగా ఉన్న జనరల్ ఆండర్స్ దానికి సమాధానంగా వేరువేరుగా పోలిష్‌దళాలు యుద్ధరంగానికి వెళ్ళుట కంటె అన్ని దళాలుకలిసి, 1942 జూన్ 1వ తేదీనాటికి జర్మన్లతో యుద్ధా నికి వెళ్ళుట మంచిదని సమాధానం ఇచ్చాడు।

42 జూన్ 1 వ తేదీ వచ్చింది. అప్పటికిగూడా పోలిష్ సైన్యాలను యుద్ధరంగానికి పంపుటకు యిష్టంచూపించలేదు. సోవియట్ ప్రభుత్వం ఆ విషయాన్నిగురించి తిరిగి ప్రస్తావించినపుడు జనరల్ సికోర్‌స్కీ- లండన్‌నుంచి "వేరువేరుగా పోలిష్‌దళాలు సోవియట్-జర్మన్ యుద్ధరంగ ములో పాల్గొనుటవల్ల ప్రయోజనమేమీ ఉండ"దని టెలిగ్రాం పంపాడు.

ఈ పరిస్థితులలో యుద్ధకాలాన్నిబట్టి సోవియట్ యూనియన్‌లో ప్రజలకు, సైన్యాలకు – అందరికీ ఆహారసామగ్రుల రేషన్ తగ్గించాల్సి వచ్చింది. అప్పుడు పోలిష్ సైన్యాలను యుద్ధరంగంలో పోరాడే సైన్యా లుగా పరిగణించక, వాటికిగూడా అందరితోపాటు రేషన్ తగ్గించవలసి వచ్చింది.

ఈ లోపల పోలిష్‌ప్రభుత్వం ఒక కబురుచేసింది. 44,000 మంది పోలిష్ సైనికులను మాత్రమే సోవియట్ యూనియన్‌లో ఉంచి, మిగిలిన

వారిని ఇరాన్‌కు పంపమని సోవియట్ ప్రభుత్వాన్ని కోరింది. సోవియట్ భూమిలో మిగిలిపోయిన 44,000 సైనికులను యుద్ధరంగ సైనికులుగా పరిగ్రహించుటకు వీలులేని పరిస్థితులలో వారికిగూడా రేషన్ తగ్గించే నిర్ణయం వర్తించబడింది.

1942 మార్చిలో 31,488 మంది పోలిష్ సైనికులు, 12,455 మంది వారికుటుంబాలకు చెందినవారు సోవియట్ యూనియన్ వదిలిపెట్టి వెళ్లారు.

1942 జూన్ 10 వ తేదీన పోలెండు ప్రభుత్వం మరొక కబురు పంపుతూ సోవియట్ యూనియన్‌లో ఇంకా కొన్ని పోలిష్ దళాలను నిర్మించాలని కోరింది. తయారుచేయబడిన దళాలను, పూర్వం జరిగిన ఒడంబడికకు వ్యతిరేకంగా, సోవియట్ - జర్మన్ యుద్ధరంగానికి పంపుటకు పోలిష్‌ప్రభుత్వం నిరాకరించినందువల్ల, ముందు సోవియట్ భూమి మీద పోలిష్ సైన్యాలను నిర్మించుటకు వీలులేదని సోవియట్ ప్రభుత్వం జవాబు ఇచ్చింది.

వెంటనే మిగిలిన 44,000 మంది పోలిష్‌సైనికులను గూడా సోవి నుంచి పంపివేయుమని పోలిష్‌ప్రభుత్వం కోరింది. ఆ కోర్కె ప్రకారం 1942 ఆగస్టులో మిగిలిన 44,000 మందిని గూడా సోవియట్ ప్రభుత్వం సోవియట్ యూనియన్ నుంచి ఖాళీజేయనిచ్చింది, దీనితో పోలిష్‌ప్రభుత్వ వైఖరి పూర్తిగా స్పష్టపడింది. 1941 డిశంబరు 1 వ తేదీన చేసిన ప్రకటనలో "సోవియట్ యూనియన్‌లో ఉన్న పోలిష్‌సైన్యాలు సోవియట్ సైన్యాలతో భుజంభుజం కలిపి హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడుతాయి" అని పోలిష్‌ప్రభుత్వం చేసిన వాగ్దానం ఈ విధంగా భగ్నమయింది.

రెండవసారి 44,000 మంది ఖాళీచేయునప్పుడు వారితోపాటు వారి కుటుంబాలకు చెందిన 25,000 మంది పోలిష్ పౌరులను గూడా ఖాళీచేయుటకు అనుమతి కోరబడింది. సోవియట్ ప్రభుత్వం అంగీకరించింది. మొత్తంమీద 1942 లో 76,491 మంది పోలిష్‌సైనికులు, 37,756 మంది వారి కుటుంబాలకు చెందినవారు సోవియట్ యూనియన్‌నుంచి ఖాళీచేశారు.

తరువాత మరొక 110 పోలిష్ కుటుంబాలను గూడా ఖాళీచేయుటకు పోలిష్ రాయబారి కోరినపుడు సోవియట్ ప్రభుత్వం వెంటనే అంగీకరించింది. తరువాత పోలిష్‌ప్రభుత్వం పోలిష్‌పౌరులను గురించిగాని, వారిని ఖాళీచేసే విషయం గురించిగాని ఎప్పుడూ కోరలేదు. కాని సోవియట్ ప్రభుత్వం, పోలెండు పౌరులను ఖాళీచేయకుండా అడ్డువచ్చిందని,

ఆటంకపరిచిందని పోలిష్ ప్రభుత్వం లండన్‌నుంచి దుష్ప్రచారం సాగించింది.

పైకథ అంతా పరిశీలిస్తే, సోవియట్ యూనియన్‌లో శిక్షణ ఇప్పించుకొన్న పోలిష్ సైనికులను హిట్లర్‌కు వ్యతిరేకంగా ఉపయోగించుటకు పోలిష్ ప్రభుత్వం నిరాకరించిందని, పైగా సోవియట్ ప్రభుత్వంమీద నిందారోపణలు చేయడం ప్రారంభించిందని విదిత మవుతుంది.

పోలిష్ ప్రభుత్వం ఈవిధంగా ఎందుకు ప్రవర్తించింది ? తయారైన పోలిష్ సైన్యాలను హిట్లర్ మీదగాక ఎవరిమీద ఏప్రాంతంలో ఉపయోగించాలని ?

దీనికంతకూ వెనుక మరొక చరిత్ర ఉంది. 1920 లో సోవియట్ ప్రభుత్వంనుంచి పశ్చిమ తెల్లరష్యాను, పశ్చిమ యుక్రెయినును పోలెండు ప్రభుత్వం స్వాధీనపరచుకుని పోలెండులో కలుపుకుంది. తరువాత ఆ ప్రాంతాలు 1939 నవంబరులో సోవియట్‌యూనియన్‌లో సోషలిస్టు శిప బ్లిక్కులుగా చేరిపోయినాయి. ఈ ప్రాంతాలు ఇంకా తనకు చెందినవేనని లండన్‌లో కూర్చున్న పోలిష్‌ప్రభుత్వవాదన. తరువాత హిట్లర్ రష్యా మీద దాడి వెడలినపుడు, ఆ ప్రాంతాలలో వున్న ప్రజలకు గూడా శిక్షణ యిచ్చి హిట్లర్‌కు వ్యతిరేకంగా సోవియట్ ప్రభుత్వం సైన్యాలను నిర్మించింది. ఆ సమయంలో, ఆ ప్రాంతాలకు చెందిన కొద్దిమంది (నూటికి 5 గురు) పోలిష్ జాతివారిని పోలిష్ జాతిగానే పరిగణించి వారికిగూడా శిక్షణయిచ్చి, పోలిష్‌సైన్యాలక్రింద సోవియట్‌ప్రభుత్వం పరిగణించింది. కాని శిక్షణ యిచ్చిన పోలిష్‌సైన్యాలను హిట్లరుకు వ్యతిరేకంగా వుపయోగించకుండా సోవియట్‌యూనియన్ నుంచి బయటకు తీసుకువెళ్ళటం ప్రారంభించిన తరువాత, యికముందు ఆ శిక్షణగూడా యిచ్చుటకు వీలు లేదని, పోలెండులోని తెల్లరష్యా, యుక్రెయిన్ ప్రాంతాలకు చెందినపోలిష్ జాతికి చెందినవారుగూడా శిక్షణపొందినప్పటికి పోలిష్‌సైన్యాలకు చెందరని సోవియట్‌ప్రభుత్వం ప్రకటించింది. ఇందులో అన్యాయం యేముంది ?

హిట్లర్‌కు వ్యతిరేకపోరాటం ప్రధానంగా గాక, బ్రిటన్, అమెరికా దేశాలలోని ఫాసిస్టుమతాలతో కలిసి, ఇంకా ప్రాణంమీదికి వచ్చినప్పుడు గూడా, సోవియట్‌కు వ్యతిరేకంగా దుష్ప్రచారం చేయుటకు పోలిష్ ప్రభుత్వం పూనుకుంది.

* * * *

పోలిష్ప్రభుత్వప్రాసిద్ధువై ఖరిని తెలియజేసేమరొకవిషయంతీసుకుందాం.

సోవియట్ ప్రభుత్వానికి లండన్‌లో వున్న పోలిష్ ప్రభుత్వానికి 1941 జూలైలో సంబంధాలు తిరిగి ఏర్పడినప్పటినుంచి, పోలిష్ప్రభుత్వం కోరినట్లుగా సోవియట్ యూనియన్‌లో దిగబడిపోయిన పోలిష్ పౌరులకు అవసరమైన సహాయంచేస్తూ వచ్చింది. ఈ ఉద్దేశ్యంతో పనిచేయుటకై పోలిష్ ప్రతినిధుల ఆఫీసులు 20 ప్రదేశాల్లో స్థాపించుటకై సోవియట్ ప్రభుత్వం అనుమతి యిచ్చింది. ఆయా స్థానాల్లో వుండే పోలిష్ ప్రతి నిధులు ఆయా ప్రాంతాల్లో ఉండే పోలిష్ పౌరులకు అవసరమైన సహాయం యిచ్చుటకు గూడా బాధ్యత తీసుకున్నారు. యుద్ధకాలంలో సోవియట్ భూమిలో వున్న పోలిష్ పౌరుల సహాయార్థమై 10 కోట్ల రూబుల్స్ సోవి యట్ప్రభుత్వం అప్పుగా యిచ్చింది. ఈ ఫండుతో ఆ 20 ప్రదేశాల్లో ఏర్పడిన పోలిష్ కేంద్రాలు సహాయంచేస్తూ వచ్చినాయి. ఆ పనిలో తోడ్ప డుటకుగాను 421 మంది ప్రతినిధులను నియమించుటకు గూడా పోలిష్ ఆఫీసులకు సోవియట్ప్రభుత్వం అధికారం యిచ్చింది. 1943 జనవరి 1వ తేదీనాటికి ఈ నియామకం గూడా జరిగింది.

ఈవిధంగా పోలిష్ రాయబారి కార్యాలయంవారి కేంద్రాలు సోవి యట్ యూనియన్ అంతటా వ్యాపించుటకు అవకాశం కల్గింది. సోవి యట్‌లో ఉన్న ఈ పోలిష్‌రాయబారి కార్యాలయంవారు. పోలిష్‌భాషలో "పోల్కా్స్" అను పత్రికను గూడా నడుపుటకు ప్రారంభించారు.

పైన చెప్పబడిన సహాయమే గాకుండా, పోలిష్ ఆర్థికవివారణ సంఘాలకు ఆర్థికంగా అనేకరకాల సహాయాలు సోవియట్ప్రభుత్వం చేస్తూ వచ్చింది. ఉదాహరణకు ఆహారపదార్థాల స్టాకులను కొన్నింటిని పోలిష్ ప్రజలకు ప్రత్యేకించింది. వాటిని సరఫరాచేయుటకు తగ్గింపుఛార్జీలతో ప్రత్యేక రైల్వేసౌకర్యాలను కూడా ఏర్పాటుచేసింది. ఈవిధంగా సోవియట్ ప్రభుత్వసహాయంతో, 589 ధర్మసంస్థలను పోలిష్‌పౌరులకొరకు పోలెండు ప్రభుత్వం ఆర్గనైజ్ చేసింది. వీటిలో ఉచిత భోజనశాలలు, బాలబాలికల గృహాలు, శిశురక్షణాలయాలు. అశక్తులైనవారికి వసతిగృహాలు వున్నాయి. యుద్ధకాలంలో ఎన్నికష్టాలున్నప్పటికీ లెక్కచేయక, స్థానికసోవియట్లు వివిధప్రాంతాల్లో ఉన్న పోలిష్ప్రజలందరికి అవసరమైన సహాయాన్ని చేస్తూ వచ్చినాయి.

సోవియట్ ప్రజలకు, పోలిష్ ప్రజలకు స్నేహసంబంధాలు పెంపొందించుటకు గొప్ప అవకాశాలు కల్గిన ఈ పరిస్థితులలో సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోలిష్ ప్రభుత్వం కుట్రలు ప్రారంభించింది; విచారణకు తీసికొనివచ్చినపుడు దేశమంతటా వ్యాపించిన పోలిష్ రాయబారి కార్యాలయంవారి యూనిట్లకుచెందిన ఉద్యోగులే ఈకుట్రలకు దిగారని తేలింది. ఉదాహరణకు: పోలిష్ మిలిటరీ మిషన్‌కుచెందిన జనరల్ వోలికోవస్కీ, వ్లాడివాస్టక్ ప్రాంతంలో పోలిష్ రాయబారి కార్యాలయానికి చెందిన ఆర్లెట్, జాలెన్స్కీ; అర్ఛేన్జెల్‌ప్రాంతంలో పనిచేస్తున్న గ్రూయర్ అను పోలిష్ ఉద్యోగి, రాయబారి కార్యాలయానికిచెందిన గ్లొగోవస్కీ మొదలైనవారు ఈ కుట్రలలో పాల్గొన్నారని నిరూపించబడిన తరువాత, సోవియట్ ప్రభుత్వం వారిని సోవియట్ యూనియన్‌నుంచి బయటికి పంపివేసింది.

తరువాత మరికొందరు పోలిష్ ఉద్యోగస్థులు నేరంచేసినప్పుడు గూడా, విచారణ జరిగినతరువాత సోవియట్‌నుంచి బయటికి పంపివేయబడ్డారు. కొంతమందికి పౌరసత్వ హక్కులను కొన్నింటిని లేకుండాజేయుటకూడా జరిగింది. వీరందరూగూడా చేసిన నేరంయేమిటి? సోవియట్ ప్రజలకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్‌లోవున్న పోలిష్ పౌరులలో ప్రచారంచేశారు. హిట్లరు ముఠాకుచెందిన ఫాసిస్టులను అభినందిస్తూ, సోవియట్‌నుగురించి నిస్పృహ గల్గిస్తూ, ప్రచారంచేశారు. ఈ చర్యలన్నిటిలో పోలిష్ రాయబారి కార్యాలయంవారికి ప్రధానపాత్ర ఉందని గూడా కోర్టులలో రుజువుచేయబడింది. రహస్యవార్తలు పంపుతూ, రహస్యంగా సూచనలు యిస్తూ పోలిష్ రాయబారి కార్యాలయంవారు కుట్రలు వ్యాపింపజేశారు. 1942 మే 31 వ తేదీన పోలిష్‌రాయబారికి ఈ విషయాలన్నిటిని తెలియజేస్తూ సోవియట్ ప్రభుత్వం హెచ్చరికచేసింది. కాని తరువాతగూడా సోవియట్ వ్యతిరేక కుట్రలను పోలిష్ రాయబారి కార్యాలయం మానలేదు. అందువల్ల 1942 జూలై 20 వ తేదీన సోవియట్ యూనియన్‌లో వివిధ ప్రాంతాల్లో స్థాపించబడిన కేంద్రాలనన్నిటిని ఆపు చేయవలెనని సోవియట్ ప్రభుత్వం పోలిష్‌రాయబారులకు తెలియజేసింది.

పోలిష్ ప్రభుత్వ ప్రేరేపణవల్ల ఇట్టి సోవియట్ వ్యతిరేక కుట్రలకు పోలిష్ రాయబారి కార్యాలయం దిగిందనుటలో సందేహంలేదు. పోలిష్ సైన్యాలకు శిక్షణ యిప్పించుకొని సోవియట్ యూనియన్‌నుంచి

బయటకు తీసుకునివెళ్ళిన పోలిష్ ప్రభుత్వం, సోవియట్ యూనియన్ లోపలినుండియే కుట్రలుచేసి పత్రికలద్వారా బ్రిటన్ అమెరికాలలో సోవియట్ వ్యతిరేక ప్రచారంచేయ ప్రారంభించింది. 1939 వరకు ఏ యే ప్రభుత్వవర్గాలచేతుల్లో కీలుబొమ్మగా ఉండి హిట్లర్ దురాక్రమణలకు సహాయపడిందో, ఇప్పుడుగూడా పోలిష్ ప్రభుత్వం ఆ ప్రభుత్వాల చేతుల్లోనే ఉంది. హిట్లర్‌కు, ఫాసిస్టులకు సహాయపడే సోవియట్ వ్యతిరేక దుష్ప్రచారానికి దిగింది. ప్రపంచ పరిస్థితులలోవస్తూన్న అనేక మార్పుల నుంచి పోలిష్ ప్రజలు, ఇతర ప్రజలు పాఠాలు నేర్చుకున్నారేమోగాని ప్రభుత్వవర్గాలు నేర్చుకున్నదేమీ లేదు.

* * *

పోలిష్ ప్రభుత్వంయొక్క కుట్రలను గురించి ఇంకా పరిశీలిద్దాం.

1941 లో పోలిష్‌సైన్యాలకు శిక్షణ ఇచ్చుటకు సోవియట్‌భూమిలో దక్షిణప్రాంతాలు కొన్ని నిర్ణయించబడినవని తెలుసుకున్నాం. సోవియట్ యూనియన్‌లో నిర్మించబడిన పోలిష్‌సైన్యాలకు అధిపతి జనరల్ ఆండర్స్. పోలిష్‌సైన్యాల శిక్షణకై దక్షిణ సోవియట్‌ప్రాంతం నిర్ణయించబడినపుడు ఇతడికి ఎక్కువ సంతోషం కల్గింది. కారణం? తన సోదరసైన్యాధిపతి (పోలిష్) బెర్లింగుతో ఈ విధంగా చెప్పాడు :

" ఈ శిక్షణాకేంద్రాలు, సోవియట్ - జర్మన్ యుద్ధరంగానికి చాలా దూరంగా ఉన్నాయి జర్మనీ కాళ్ళక్రింద రెడ్‌ఆర్మీ త్వరలోనే నాశనమయిన తర్వాత, కాస్పియన్ సముద్రం దాటి మేము ఇరాన్ చేరుకుంటాం. అప్పుడు ఆయుధాలుకల్గిన శక్తిగా మేము మాత్రమే మిగులుతాం. అప్పుడు మా ఇష్టం వచ్చినట్లు చేస్తాం." (మాస్కో న్యూస్). ఈ విధంగా చెప్పిన ఆండర్స్ సోవియట్ ప్రభుత్వానికి ద్రోహంచేయడం ప్రారంభించాడు. శిక్షణా కాలం సాధ్యమైనంతగా పొడిగించి ఆలస్యంచేశాడు. సోవియట్ ప్రజల సహాయంకొరకు బ్రిటన్‌నుంచి వచ్చే సహాయాన్ని కాస్పియన్ సముద్రంవద్ద వీలైనంత ఆలస్యం చేయుటకు కుట్రలు పన్నాడు.

1942 మేలో ఇరాన్‌లో ఉన్న పోలిష్ సైనికకేంద్రాలలో, సోవియట్ ప్రజల సహాయంకొరకు బ్రిటన్‌నుంచి పంపబడిన ఆహారపదార్థాలు మురిగిపోతున్నప్పటికీ, జెనరల్ ఆండర్స్ వాటిని సోవియట్ ప్రజలకు సకాలంలో చేర్చకుండా ఆలస్యంచేశాడు. వాటి సలఫరా కొరకు ప్రత్యేక

గోడవున్లు, రైలుమార్గాలు సోవియట్ ప్రభుత్వం నిర్మించింది. కాని జెనరల్ ఆండర్స్ ముఠా, ఆ సరుకులను ఇరాన్ నుంచి ఓడలలో ఎక్కించకుండా చూసి ద్రోహం చేసింది.

పాపం, ఆండర్స్, పోలిష్ ప్రభుత్వం ఆశించినట్లు రెడ్ ఆర్మీ అప జయం పొందలేదు; వారి ఆశలు నిరాశలయినాయి. కకాసస్ ప్రాంతం లోకి హిట్లర్ సైన్యాలు పురోగమిస్తున్న రోజుల్లో, ఫాసిస్టులతో పోరాడ కుండా పోలిష్ సైన్యాలను సోవియట్ యూనియన్ నుంచి ఆండర్స్ (పోలిష్ ప్రభుత్వ సూచనల కనుగుణ్యంగా) భద్రంగా ఇరాన్ లోకి తీసుకొని పోయాడు। జెనరల్ ఆండర్స్ గాని, పోలిష్ ప్రభుత్వ సైన్యాధిపతులుగాని నాజీలతో ఎక్కడా యుద్ధం చేయలేదు.

కాని వారు మరొక పోరాటం చేస్తూవచ్చారు. పోలిష్ సైన్యాలలో చేరుటకుముందుకు వచ్చిన పోలిష్ పౌరులలో; ఎవరన్నా సోవియట్ సాను భూతిపరులు ఉన్నారని అనుమానిస్తే, వారిని సూటిగా కాల్చి చంపివేశారు। సోవియట్ యూనియన్ లో ఉన్న పారిశ్రామిక కేంద్రాలను గురించి, వ్యవ సాయ క్షేత్రాలను గురించి, స్థావరాలను గురించి రహస్యంగా వార్తలు సంగ్రహించే గూఢచార ముఠాలను జెనరల్ ఆండర్స్ ముఠా ఆర్గనైజు చేసింది.

ఇక లండన్ లో ఉన్న పోలిష్ ప్రభుత్వంలో ఉన్న ఫాసిస్టులలో సోసెన్కోవస్కీ అగ్రగణ్యుడని ఇదివరకే తెలుసుకున్నాం. 1941 లో జరిగిన పోలిష్ - సోవియట్ ఒడంబడికకు అసమ్మతి తెలుపుతూ రాజీనామా ఇచ్చిన ఫాసిస్టునాయకుడు ఇతడు। జెనరల్ సికోర్‌స్కీ, (అప్పుడు ప్రధానమంత్రి) సోవియట్ తో స్నేహసంబంధాలను పెంపొందించాలని చేసే ప్రయత్నాలను భగ్నంచేయుటకై పోలిష్ ఫాసిస్టుల నందరిని సోసెన్కోవస్కీ కూడగట్టుతూ ఉండేవాడు. ఆయన నాయకత్వంక్రింద పోలెండులో ఒక రహస్య ఉద్యమం బయలుదేరింది. యుగోస్లావియాలో 'మిహిలోవిచ్' లాంటి ద్రోహులు జర్మనులకు సహాయపడుతూ, యుగోస్లావ్ ప్రజలకు ఎలా ద్రోహంచేస్తూ వచ్చారో, అదేవిధంగా ఈ రహస్యదళాలు గూడా జెనరల్ సోసెన్కోవిస్కీ ఆజ్ఞలక్రింద పోలెండులో పనిచేయటం ప్రారంభించాయి. 'స్విట్' అను రేడియోను స్థాపించి, పోలెండులో జర్మనులకు వ్యతిరేకంగా పనిచేస్తున్న గెరిల్లా దేశభక్త దళాలను నాశనంజేయమని ఆ రేడియోద్వారా ప్రోత్సాహం చేయడం ప్రారంభించారు. సోసెన్కోవస్కీచే నడుపబడే

" పోలిష్ సైనికుడు " అనుపత్రిక రెండవరంగాన్ని వ్యతిరేకిస్తూ బహిరంగ ప్రచారం చేస్తూ వచ్చింది.

సొస్నోవస్కీ ముఠాయొక్క ప్రధాన కార్యక్రమం పోలిష్ - సోవియట్ సంబంధాలను భగ్నంచేయుటయేగాని మరేమీగాదు. పోలెండుకు - సోవియట్‌కు మధ్య స్నేహ సంబంధాలు వృద్ధి అయితే పోలెండులో ప్రజా శక్తులు బలపడగలవని వారి భయం. అందువల్ల పోలిష్ ప్రభుత్వానికి సోవియట్ ప్రభుత్వానికి మధ్యఉన్న తగాదా కేవలం సరిహద్దులనుగురించి మాత్రమే అని తలచుట పొరపాటు. ఆ తగాదాకు అంతరార్థం వేరుగా ఉంది. పోలెండులో ప్రజాఉద్యమం బలపడుటకు పోలిష్ - సోవియట్ స్నేహసంబంధాలు సహాయపడునని తెలుసుకుని రోజురోజుకూ ఈ ముఠా సోవియట్‌కు మరింత బద్ధవిరోధులుగా తయారవుతూ, సోవియట్‌మీద పెరుగుతున్న వైషమ్యంతో, హిట్లర్ ముఠాలతో గూడా కలియుటకు సంసిద్ధులయారు.

1942 లో స్టాలిన్‌గ్రాడ్‌వద్ద అపజయం పొందినప్పటినుంచి నాజీ సైన్యాలు తెప్పరిల్లుకోకుండా తిరోగమనం చేసినాయి. రెడ్‌ఆర్మీ ముందుకు సాగిపోయింది. ఇక పోలెండు సరిహద్దులను సమీపించే సమయం వచ్చింది. ఈ సమయంలో లండన్‌లోఉన్న పోలిష్‌ప్రభుత్వం, పోలెండులో పనిచేస్తున్న సోస్నోవస్కీ దళాలకు ఎటువంటి పాఠాలు చెప్పారో చూడండి: "హిట్లరూ, స్టాలినూ ఇద్దరూ ఒకటే. భేదం ఏమీలేదు." "పోలెండు తిరిగి స్వాతంత్ర్యం సంపాదించాలంటే, రెడ్‌ఆర్మీ అపజయం పొందాలి; లేనియెడల కనీసం బలహీనపడాలి" "జర్మన్ సివిల్ అధికారులతో స్నేహసంబంధాలను పెంపొందించుకుంటూ వారితో పొందికతో మెలగాలి" "బోల్షివిక్ గెరిల్లా దళాలలో చేరుటకు ఎవరైనా తయారైతే, వారిని ద్రోహులుగా పరిగణించి చంపివేయండి." "మనదేశంలో ప్రవేశించుటకువచ్చే సోవియట్ సైనికులమీద ప్రతీకారం తప్పక తీసుకుంటాం." "బైలోరష్యన్లు మన బద్ధశత్రువులు. వారిని గురించి సాక్ష్యం ప్రోగుచేసి, జర్మన్లకు అప్పజెప్పండి. ఈ విధంగా బైలోరష్యన్ల పీడ వదులుటయేగాక, వారికి జర్మన్లకు మధ్య వైషమ్యాలుగూడా పెరుగుతాయి." "కమ్యూనిస్టులంటే జర్మన్లకు అపరిమితద్వేషం. కనుక బైలో రష్యన్లను కమ్యూనిస్టులని పిలిచి, జర్మన్లచే వారిని చంపించండి"—ఈ విధమైన ఫాసిస్టు సూచనలు పంపిస్తూ, పైకి మాస్కోతో స్నేహసంబంధాలు కావాలని పోలిష్

ప్రభుత్వం ఎంత ఏడ్చినా, ఈ దొంగ ఏడుపులను ఎవరూ నమ్మరని 'ప్రావదా' పత్రిక వ్రాసింది. పోలిష్‌ప్రభుత్వం వాస్తవిక ప్రపంచంలో లేదు. యదార్ధపరిస్థితులతో దానికి సంబంధం పోయింది, 'సోవియట్ వ్యతిరేక ద్వేషంతో కళ్లుగనపడకుండా, గుడ్డిదై ఊహాప్రపంచంలో కలలు గంటోంది అనికూడా 'ప్రావదా' పత్రిక వ్రాసింది.

పోలిష్ ప్రజలకు, లండన్‌లోవున్న పోలిష్ ప్రభుత్వానికి ఏంసంబంధం ఉన్నది? రాత్రింబగళ్ళు జర్మన్లతో రహస్యంగా పోరాడుతూ, స్వాతంత్ర్యం ఎప్పుడాఅని కనిపెట్టుకొనిఉన్న పోలెండు ప్రజలకు, లండనులో ఫాసిస్టు స్నేహితులమధ్య కూర్చుని, జర్మన్లను బలపరిచే పోలిష్ ప్రభుత్వానికి ఏంసంబంధం ఉండగలదు? పోలెండులో రహస్యంగా ఉండి ఫాసిస్టులతో పోరాడుతున్న ప్రజాపక్షంతరపున జోసెఫ్ కొవాల్‌స్కీ బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ పత్రికఅయిన 'డెయిలీవర్కర్' కు సందేశం పంపుతూ, "పోలెండులో హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజాపక్షమే పోలెండు ప్రజలయొక్క నిజమైన ప్రతినిధి. పోలిష్ ప్రజలమధ్య తగాదాలు పెట్టి జర్మనులకు సహాయపడుతున్న పోలిష్ ప్రభుత్వం (లండన్) పోలిష్ ప్రజలకు నాయకత్వం వహించలేదు" అని చెప్పాడు.

పోలెండు ప్రజలు నిరాకరిస్తున్నా, "మేమే పోలెండు ప్రభుత్వం" అని లండన్‌లోఉన్న పోలిష్ ప్రభుత్వం అంటుంది. పోలెండు ప్రజలతో సంబంధంలేక ఫాసిస్టులకు సహాయపడే ప్రభుత్వం పోలెండు ప్రజల ప్రభుత్వం ఎలా అవుతుంది? ఈ ప్రశ్నకు పోలెండు ప్రజలే సమాధానం చెప్పేరోజులు దగ్గరకు వస్తున్నాయి.

## 6. ప్రభుత్వవర్గాల కుట్ర

స్టాలిన్‌గ్రాడ్ వద్దనుంచి పశ్చిమానికి పురోగమిస్తూ జర్మనులను హతంగావిస్తూవచ్చిన రెడ్ ఆర్మీ విజయపరంపరలు ఫాసిస్టుల వ్యూహాన్ని పూర్తిగా భగ్నం చేసినాయి. రెండవరంగం అప్పటికి యింకా ప్రారంభం కాలేదు. కాని రెండవరంగంకొరకు, ఫాసిస్టుల సత్వర ఓటమికొరకు ప్రపంచ ప్రజలందరూ సాగిస్తున్న ఆందోళన మిన్ను ముట్టుతోంది. జర్మనులకు అన్నివైపులనుంచి వ్యతిరేకశక్తులు చుట్టుముట్టివేస్తున్న సూచనలు కన్పిస్తున్నాయి. ఇక ఓటమి తప్పదని గుర్తించడం ప్రారంభించిన జర్మన్ ప్రభుత్వం అపజయంపాలుగాకుండా చేసుకొనుటకై పెద్ద కుట్ర చేసింది. అవి 1943 ప్రారంభ దినాలు. "బోల్షివిజమ్" పురోగమించి మీదికి వస్తోందనే దుష్ప్రచారం లేవదీసింది. ప్రపంచమంతటా బోల్షివిక్ వ్యతిరేక ప్రచారం లేవదీసి, సోవియట్ యూనియన్‌కు-మిత్రమండలిలో ఉన్న ఇతర సామ్రాజ్యవాద దేశాలకు మధ్య చీలికలు కల్పించి, బ్రిటన్ అమెరికాలతో ప్రత్యేక సంధిచేసుకొనుటయే ఈ కుట్రయొక్క ప్రధాన ఆశయం.

1943 మే 1 వ తేదీన స్టాలిన్ యీ విషయాన్ని ప్రపంచానికి చాటాడు. "విదేశ పత్రికల ప్రచారాన్నిబట్టి చూస్తే, సోవియట్‌తో బ్రిటన్, అమెరికాలు తెగ్గించుకుంటే, బ్రిటన్ అమెరికాలతో సంధిజేసుకొనుటకు జర్మనీ సిద్ధంగావున్నదని తెలుతుంది. లేక సోవియట్ ప్రభుత్వం బ్రిటన్, అమెరికాలనుంచి విడిపోతే సోవియట్‌తో సంధిచేసుకొనుటకుకూడా జర్మనీకి అభ్యంతరంలేదు ద్రోహానికి అలవడిన యీ ఫాసిస్టు కిరాతకులు ఇతరులనుకూడా తమవలె ద్రోహులుగా పరిగణించటానికి సాహసించారు!"

యూరప్ ఖండంలో ఉన్న సోవియట్ వ్యతిరేక శక్తులను, ప్రపంచంలో ఉండే విద్రోహశక్తులను అన్నిటినీ సమీకరించి, రెండవరంగాన్ని తెరవకుండాజేయుటకు, జర్మనీతో ప్రత్యేక సంధి జరుగునట్లు చేయుటకు గోబిల్స్ మంత్రిచేసిన కుట్ర ప్రారంభించాడు.

"యూరపియన్ నాగరికతను బోల్షివిజం నాశనం చేయలేదు"; "పశ్చిమ యూరపులో జర్మనీ రక్షణలు అభేద్యములైనవి"; "జర్మనీని ఓడించాలంటే మిత్రమండలి దేశాలమధ్య అవసరమైన ఐక్యత ఎప్పటికీ ఏర్పడలేదు". ఈ మూడు విద్రోహక నినాదాలతో, జర్మన్ రేడియోలు, ఫాసిస్టులచే ప్రపంచమంతటా నడుపబడే రేడియోలు 35 కోట్ల యూరపియన్ ప్రజలకు, ఆఫ్రికా, ఇండియా, మధ్య ఆసియా దేశాలు, దూర ప్రాచ్యదేశాలు, దక్షిణ అమెరికా, యునైటెడ్ స్టేట్సు, ఆస్ట్రేలియా మొదలైన దేశాల ప్రజలలో నిరంతరం ప్రచారం చేసినాయి. ఎలాగైనాసరే మిత్రమండలిలో చీలికలు కల్గించుటయే జర్మన్ ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం.

ఈ కుట్రలో పాల్గొనుటకై లండన్‌లో పోలిష్‌ప్రభుత్వం సిద్ధంగా ఉంది. పోలెండు దేశంలో తిరిగి తమకు గతులుండవనే భయంతో సోవియట్ వ్యతిరేక నినాదాలతో, జర్మన్ల ప్రచారంతో కలిసిపోయింది పోలిష్ ప్రభుత్వంయొక్క దుష్ప్రచారం.

* * *

1943 ప్రారంభంలో బ్రిటన్, అమెరికాలలో ఉన్న పోలిష్‌ప్రజలు తీవ్రమైన సోవియట్ వ్యతిరేక ప్రచారం లేవదీశారు. ప్రత్యేక సంధి కొరకు సోవియట్ సైన్యాలలో ప్రచారం చేస్తూవచ్చిన ఇద్దరు పోలిష్ ఫాసిస్టులు (ఆల్టర్, ఎర్లిచ్) 1941 డిశంబరులో ఉరిదీయబడ్డారు. ఈ విషయాన్ని ఆధారంజేసుకొని 1943 లో ప్రచారం లేవదీయబడింది. 1941 డిశంబరులో జర్మన్ మారణయంత్రాలను యెదుర్కొని సోవియట్ ఒంటరిగా నిలబడి పోరాడుతున్న రోజులు. ఆ సమయంలో జర్మనీతో ప్రత్యేక సంధి చేసుకొనమని రెడ్‌ఆర్మీలో ప్రచారంగావించిన ఫాసిస్టులు ఇద్దరికి జరిగిన శాస్తి అది. ఆ విషయాన్ని తీసుకొని 43 లో బ్రిటన్, అమెరికాలలో ఉన్న సోవియట్ వ్యతిరేకులను, హిట్లర్ ఓటమి అంటే భయపడే వారిని చేర్చుకుని, వారిమద్దతతో దుష్ప్రచారం ప్రారంభమైంది. పైగా "సోవియట్ యూనియన్ మారుమూలలలో చిక్కుకొనిపోయిన వేలకువేల పోలిష్ పౌరులగతి ఏమైందోకూడా ఇంతవరకు సోవియట్ ప్రభుత్వం బయటపెట్టలేదు" అని నిందిస్తూ లండన్‌లోని పోలిష్ పౌరులు కొందరు తీర్మానంచేశారు! అపోహలు కల్గించాలంటే ఇంత కంటె ఏంచెయ్యాలి?

ఈవిధంగా జర్మన్ ప్రభుత్వ కుట్రకు తోడుగా పోలిష్ ప్రభుత్వ వర్గాల కుట్రగూడా సహాయపడింది. కాని ఇది ఇంకా ప్రారంభదశలో జరిగిన కథ. తరువాత అసలుకుట్ర బయటపడింది.

1943 ఏప్రియల్ 11 వ తేదీన జర్మన్ రేడియో "స్మోలెన్స్క్ ప్రాంతంలో కటిన్ అడవివద్ద 10000 పోలిష్ ఆఫీసర్ల శవాలు కనబడ్డాయి. పోలిష్ ఆఫీసర్ల దళమంతా ఈవిధంగా కాల్చబడింది. జర్మన్ ప్రభుత్వం ఈ ఘోరాన్ని గురించి విచారణ చేయగా, 1940 ఫిబ్రవరి మార్చి నెలలలో వీరు చంపబడినట్లు తేలింది. 28 మీటర్ల పొడవు, 16 మీటర్ల వెడల్పుగల అగాధంగూడా బయటపడింది. ఇందులో 3000 మంది పోలిష్ ఆఫీసర్ల శవాలు ఒకదానిమీద ఒకటి 12 వరుసలలో పూడ్చిపెట్టబడినాయి. ఈ ఆఫీసర్ల నందరిని గుర్తించవచ్చు" అని ప్రచారం ప్రారంభించింది. జర్మన్ రేడియోతోపాటు అక్షరాజ్య రేడియోలన్నీ ఈకథను రాత్రింబగళ్ళు ప్రచారం చేసినాయి.

గోబిల్స్ కల్పించి లేవదీసిన ఈ కథ అనేక రూపాలు తీసుకుంది. గోబిల్స్ ప్రచారాన్నిబట్టి చూసినా, వివరాలలోకి వెళ్ళితే, ఒకదానికి మరొకదానికి అతకకుండా తయారైంది. ఈ శవాలను చూసిందెవరు ? అనే విషయాన్ని తీసుకుంటే, పోలిష్ జాతికి చెందిన కట్టెలు కొట్టుకునే వాళ్ళని, తరువాత ఒక ముసలిరైతని, దానితరువాత ఒక జర్మన్ మిలటరీ ఆఫీసరని రకరకాలుగా చెప్పడం ప్రారంభించింది జర్మన్ రేడియో. శవాలను కనిపెట్టిన కాలం తీసుకున్నా, రకరకాలుగా చెప్పాడు గోబిల్స్. 43 ఏప్రియల్ ప్రారంభంలోనని, తరువాత 42 లోనే కనుగొనబడినవని కథ అల్లడానికి ప్రయత్నించాడు. శవాలను అన్నిటినీ గుర్తుపట్టుటకు సాధ్యమగునని చెప్పిన గోబిల్స్, వెంటనే మార్చుకొని, నూటికి 95 వంతులను మాత్రమే గుర్తుపట్టుటకు వీలవుతుందని, తరువాత అంతమందినిగూడా గుర్తుపట్టుటకు వీలులేదని చెప్పాడు. శవాలసంఖ్య విషయంలోగూడా అన్ని అబద్ధాలే. మొదట 3000, తరువాత 5000, తరువాత 10000, తరువాత 12000, అనీ, శవాలతోకూడిన అగాధాలు మొదట 1, తరువాత 2, తరువాత 6 అని రకరకాలుగా గోబిల్స్ ప్రచారంచేశాడు. ఒడెస్సాలోకూడా పోలిష్ శవాల గుంట ఒకటి కనపడిందనికూడా తరువాత చెప్పాడు. గోబెల్స్‌కు శవాల అగాధాలు ఎందుకు కనపడవు ? యూరప్ ఖండంలో ఆమూలనుంచి ఈ మూలవరకూ ప్రతి పట్టణంలో, ప్రతి దేశంలో ప్రజలను నిరంకుశంగా చంపి, జర్మన్ ప్రభుత్వం ఎన్ని లక్షల శవాలకు బాధ్యులు కాలేదు ? ఒడెస్సా పట్టణంలోనేవారు 50000 మంది సోవియట్ పౌరులను హత్య గావించి పూడ్చిపెట్టారు !

గోబెల్స్‌కు ఇటువంటి అబద్ధప్రచారమంటే లెక్కలేదు. అతడు అబద్ధాలకోరు అని ప్రపంచానికంతకూ తెలిసిందే. కాని పోలిష్‌ప్రభుత్వం వెంటనే గోబెల్స్‌ను బలపరుస్తూ పోలిష్ ఆఫీసర్ల హత్యనుగురించి సోవియట్ వ్యతిరేకప్రచారం ప్రారంభించింది. గోబెల్స్ ప్లాను తాత్కాలికంగా ఫలించింది! నిజానికి పోలిష్‌ప్రభుత్వానికి - సోవియట్ ప్రభుత్వానికి మధ్య పెరుగుతున్న వైరుధ్యం గోబెల్స్‌కు తెలుసు. పోలిష్‌ప్రజలంటే పోలిష్ ప్రభుత్వానికి పట్టకపోయినా, సోవియట్ ప్రభుత్వం దానికి బద్ధవిరోధి అనే విషయం జర్మన్ ప్రభుత్వం తెలుసుకుని, చక్కగా తెలివితేటలతో ఈ వైరుధ్యాన్ని ఉపయోగించింది. ఫాసిస్టు వ్యతిరేక పోరాటంయొక్క ప్రాముఖ్యత, మిత్రమండలి దేశాలమధ్య పెంపొందవలసిన ఐక్యత పాటించని పోలిష్‌ప్రభుత్వం గోబెల్స్ ప్రచారానికి చేయూతనిచ్చింది.

గోబెల్స్ ఈ ప్రచారాన్ని లేవదీసిన 4 రోజులకు లండన్‌లో ఉన్న పోలిష్‌ప్రభుత్వం, రష్యాలో హత్యగావించబడిన పోలిష్ ఆఫీసర్ల విషయం తమకు ఆందోళన కల్గిస్తోందని, వెంటనే దాని విషయంలో విచారణ జరగాలని, విచారణలో అంతర్జాతీయ రెడ్‌క్రాస్‌వారు సహాయం చేయాలని ప్రకటించింది.

వెంటనే మాస్కోనుంచి ' ప్రావదా ' పత్రిక పోలిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది. ఫాసిస్టు అబద్ధాలకోరులు ఇటువంటి కథలు అల్లడం ఇది ప్రథమపర్యాయం కాదని, ఆ విషయం పోలిష్ ప్రభుత్వం తెలుసుకునే ఈ విధంగా ప్రత్యక్షంగా హిట్లర్‌ముఠా ప్రచారాన్ని పోలిష్‌ప్రభుత్వం బలపరుచుట సబబుకాదని, స్వాతంత్ర్యాన్ని కోరే పోలిష్‌ప్రజలు ఈ విధంగా హిట్లరును బలపరిచే కుట్రలను గర్హిస్తారని పోలిష్ ప్రభుత్వానికి జ్ఞాపకం చేసింది. 1941 జూలై ప్రాంతాల్లో హిట్లర్ స్మోలెన్స్క ప్రాంతాలను ఆక్రమించినపుడు పోలిష్ పౌరులను, సోవియట్ పౌరులను వధించిన ఘాతుకచర్యలకు సోవియట్ ప్రభుత్వం బాధ్యత అని హిట్లర్ ప్రభుత్వం ప్రయత్నిస్తోందని, అటువంటి హంతకులను బలపరచుటకంటె దారుణ విషయం మరొకటి ఉండదని పోలిష్‌ప్రభుత్వాన్ని హెచ్చరించింది.

ఫాసిస్టులకు అనుకూలమైన ప్రచారంలో పోలిష్‌ప్రభుత్వం పాల్గొంటున్న సమయంలో, బ్రిటిష్‌ప్రభుత్వ వైఖరి ఏమిటి? 1943 ఏప్రియల్ 16 వ తేదీన, బ్రిటిష్ విదేశాంగమంత్రి ఒక ప్రకటన గావించాడు. ' పోలిష్ ఆఫీసర్ల హత్యవిషయం ' కేవలం పోలిష్‌ప్రభుత్వానికి సోవియట్

ప్రభుత్వానికి మధ్య తగాదా అని, అందులో ఏమీ జోక్యం కల్గించుకొనుట తమకు తగదని ప్రకటించాడు. ఫాసిస్టులకు సహాయపడుతూ, మిత్రమండలిలో చీలికలు కల్గించుటకు సహాయపడే పోలిష్ ప్రభుత్వవైఖరిని ఖండించకుండా, తమకు ఏమీ సంబంధంలేదని బ్రిటిష్‌ప్రభుత్వం చేసిన ప్రకటన అందరికీ ఆశ్చర్యం కల్గించింది.

ఎన్ని హెచ్చరికలు గావించినా దుష్ప్రచారాన్ని మానకుండా సోవియట్‌కు వ్యతిరేకంగా పనిచేస్తున్న పోలిష్ ప్రభుత్వంతో ఏప్రియల్ 25 వ తేదీన సోవియట్ ప్రభుత్వం సంబంధాలు త్రెంచుకుంది. హిట్లర్‌తోపాటు చేరి పోలిష్‌ప్రభుత్వం చేస్తున్న ప్రచారాన్నిబట్టి, వారిద్దరికిమధ్య సంబంధాలు ఉన్నవని; ఒంటరిగా నిలబడి సోవియట్ ప్రజలు ప్రపంచ శత్రువైన ఫాసిస్టులను ఎదుర్కొంటున్న సమయంలో పోలిష్‌ప్రభుత్వం తనవిద్రోహకవైఖరివల్ల సోవియట్ ప్రభుత్వానికి ద్రోహం చేసిందని; ఈ దుష్ప్రచారం సాగించుటద్వారా సోవియట్ ప్రభుత్వాన్ని లొంగదీసి సోవియట్లకు చెందిన సోవియట్ బైలోరష్యాను, సోవియట్ యుక్రెయిన్‌ను, సోవియట్ లిథూనియాను పోలిష్‌ప్రభుత్వం ఆక్రమించుటకు ప్రయత్నిస్తున్న విషయం తమకు పూర్తిగా తెలుసునని, ఈ కారణాలవల్ల పోలిష్‌ప్రభుత్వంతో సంబంధాలు వదులుకొనుటకు నిశ్చయించుకున్నామని పోలిష్‌ప్రభుత్వానికి • సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్ తెలియజేశాడు.

తరువాత 3 రోజులకు (ఏప్రియల్ 28) బ్రిటన్‌లో "టైమ్స్" పత్రిక పోలిష్ ప్రభుత్వంయొక్క ఫాసిస్టు వైఖరిని ఖండిస్తూ వ్రాసింది. బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడెన్ కొన్నాళ్ళ తరువాత బ్రిటిషు పార్లమెంటులో మాట్లాడుతూ పోలిష్‌కుట్ర విషయం వచ్చినపుడు "ఆ విషయాన్ని గురించి ఎంతతక్కువ మాట్లాడితే అంత మంచిది." అన్నాడు.

పోలిష్ కుట్రను బట్టబయలుజేస్తూ వెంటనే సోవియట్ ప్రభుత్వం తరపున ప్రకటనగావించాడు. నాజీల కుట్రలు ఈ విధంగా విఫలమయినాయి. కాని ప్రత్యేకసంధి కొరకు చేసిన ఈ ప్రయత్నాలను నాజీలు మానలేదు. మిత్రమండలిలో చీలికలు కల్పించాలి. 'పోలిష్ ఆఫీసర్ల హత్య'ను గురించి లేవదీసిన రోజునే, స్పెయిన్ విదేశాంగమంత్రి జోర్డానా, శాంతి సూచనలను బయటపెట్టాడు యుద్ధగతినిబట్టి ఏ పక్షమూ గెలుపొందలేదని స్పష్టపడిందని, అందరూ అలసిపోయారని, ఇక యూరపియన్ దేశాలన్నీ యునైటెడ్ స్టేట్స్‌గూడా బోల్షివిజానికి గురికానున్నవని, అందు

వల్ల అక్షరాజ్యాలమధ్య, మిత్రమండలి మధ్య సంధి అవసరమని. సంధి చేయుటకు స్పానిష్‌ప్రభుత్వం తయారుగా ఉన్నదని చిలీ, ఆర్జెంటీనా రాయబారులతో మాట్లాడుతూ చెప్పాడు. 'పోలిష్ ఆఫీసర్ల' కాండను గురించి స్పానిషు పత్రికలన్నీ సోవియట్‌కు వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేసినాయి. 'సంధిసూచనలు', 'పోలిష్ ఆఫీసర్ల హత్యా గాథ' రెండూ ఒకేసారి బయలు దేరినాయి. ఫాసిస్టు ముఠాలన్నీ ఈ రెండిటిని కలిపి ప్రచారంచేస్తూ, బోల్షివిక్కులనుంచి యూరపియన్ నాగరికతను రక్షించుటకై యూరపియన్ దేశాలమధ్య వెంటనే సంధి (సోవియట్‌ను వదిలి) అవసరమని ప్రచారం గావించినాయి దీనిబట్టి ఫాసిస్టుముఠాలన్నీ కలిసి పనిచేసినవనియేగాక పోలిష్‌ప్రభుత్వంగూడా వాటితో కలిసిపోయిందని గూడా రుజువైంది.

నిజం బయటపడిన కొలదీ, బ్రిటిష్ అమెరికన్ పత్రికలన్నీ పోలిష్ ప్రభుత్వవైఖరిని ఖండించటం ప్రారంభించినాయి. 'ఈవెనింగు స్టాండర్డు' అను లండన్‌పత్రిక : " రెండుకారణాలనుబట్టి, పోలిష్‌ప్రభుత్వమే దీనికంతకూ బాధ్యత వహించవలసి యున్నది. మొదటిది - జర్మన్లు ప్రారంభించిన నిందలలో నిజం ఉన్నదని పోలిష్‌ప్రభుత్వం అనుకొనుటకు హక్కులేదు. రెండవది : శత్రువుచేతుల్లో ఉన్న ప్రాంతంలో విచారణజరపాలని పోలిష్ ప్రభుత్వం కోరటానికి హక్కులేదు" అని వ్రాసింది.

'టైమ్సు' పత్రికలండన్‌నుంచి ఈదిగువ విధంగా వ్రాసింది :

"జర్మన్లు యీవిధంగా ఇతరులమీద నిందలువేయుట మొదటిసారి కాదు. అయినప్పటికి జర్మన్ల ప్రచారపు వ్యూహంలో పోలిష్ ప్రభుత్వం పడిపోయిందంటే చాలా విచారకరమైన విషయం. ఈ యుద్ధ ప్రారంభంలో పోలిష్ జాతిమీదనే జర్మన్లు నిందలువేసిన సంగతి పోలిష్‌ప్రభుత్వం మరచిపోయిందంటే నమ్మలేము. పోలెండులో నివసించిన జర్మన్ పౌరులను పోలిష్ ప్రభుత్వం హత్యగావించిందని అప్పుడు జర్మన్ ప్రభుత్వం ప్రచారం చేయలేదా ? అబద్ధపు నిందలువేసి ప్రచారంచేయుట జర్మన్లకు ఇది మొదటిసారికాదు; అయినప్పటికి జర్మన్లు లేవదీసిన అబద్ధపు 'పోలిష్ ఆఫీసర్ల హత్యాకాండ'ను పోలిష్ ప్రభుత్వం ఎలా నమ్మింది ?.... .... .... రష్యాకు - బ్రిటనుకు మధ్య స్నేహ సహకారాలు ఇప్పటికంటె ఈ యుద్ధకాలంలోగాని, మానవ చరిత్రలోగాని ఎప్పుడు అవసరం కానేరవు."

పోలిష్ ప్రభుత్వ వైఖరిపట్ల బ్రిటిషు కార్మికవర్గం మండిపడింది. స్కాటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు సమావేశంలో, జనరల్ కౌన్సిల్

సభ్యుడైన జేమ్సుకాంబెల్, "పోలిష్ ప్రభుత్వానికి ఇక్కడ యేర్పరచబడిన రక్షణాలయాన్ని, సోవియట్ వ్యతిరేక ప్రచారానికి వినియోగించదలచితే, బ్రిటన్‌లోని కార్మికసంఘాల సానుభూతిని పోలిష్ ప్రభుత్వం పోగొట్టు కొనుటయే జరుగుతుంది. పోలిష్ ప్రభుత్వం అలా ప్రవర్తించేపక్షంలో "మిమ్ములను ఆహ్వానించిన కాలం సమాప్తి చెందింది" అని చెప్పవలసి వస్తుంది" అన్నాడు.

బ్రిటిష్‌ప్రజలు, బ్రిటిష్‌పత్రికలు ఈ విధంగా పోలిష్‌ప్రభుత్వ వైఖరిని ఖండిస్తుంటే, బ్రిటిషు ప్రభుత్వవర్గాలు ఇంకా కదలలేదు. "ఆ వ్యవహారం పోలిష్, సోవియట్ ప్రభుత్వాల మధ్య తగాదా. దానితో మాకేమీ సంబంధంలేదు" అని, లేక "పోలిషు, సోవియట్ ప్రభుత్వాల మధ్య ఇటువంటి అపోహలు ఏర్పడుట చాలా విచారకరమైన విషయం" అని చెప్తూ వచ్చారు. అమెరికన్ ప్రభుత్వవర్గాలు అదేవిధంగా తన అభిప్రాయాన్ని వెల్లడి జేసింది.

బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వవర్గాలు చూపించిన ఈ వైఖరి పోలిష్ ప్రభుత్వానికి ప్రోత్సాహం కల్గించింది. ఏప్రియల్ 28 వ తేదీన (సోవియట్‌తో సంబంధాలు తెగిన తరువాత) పోలిషు ప్రభుత్వం ఒకప్రకటన చేసింది. సోవియట్‌ప్రభుత్వం స్నేహసంబంధాలు పెంపొందించుకొనుట తన ఆశయమే అని చెప్పినా, సోవియట్ ప్రభుత్వంమీద తిరిగి నిందలు మోపటం ప్రారంభించింది.

పోలిషు ఉదంతంలో బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాలు తీసుకున్న 'తటస్థ' వైఖరి జర్మన్‌ఫాసిస్టులకు ఉత్సాహం కల్గించింది. జర్మన్‌మంత్రి బ్రౌన్‌ఫోన్‌స్టూమ్ మరొక ప్రకటన గావించాడు. పోలెండులో రష్యన్లు చేసిన ఘాతుక కృత్యాలను గురించి 1940 మే 18 వ తేదీన బ్రిటిషు - పోలిషు - ఫ్రెంచి జాయింటు ప్రకటన ఒకటి ఫ్రెంచి విదేశాంగ కార్యాలయంలో దొరికిందని, రష్యన్ల ఘాతుక కృత్యాలను బయటపెట్టుటకు ఇంకా సరియైన సమయంరాలేదని జాయింటు ప్రకటనలో ఉన్నట్లు జర్మన్ ప్రచారం!

బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాల మద్దతతో పోలిషు ప్రభుత్వం జర్మన్ ఫాసిస్టులకు ఉపయోగపడే కార్యక్రమానికి దిగింది. బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాలు తమ వైఖరిని మార్చుకొనుటకు తీవ్రమైన ప్రజాం

దోళన అవసరమైంది. ఈ విద్రోహక ప్రభుత్వాల ఫాసిస్టు వైఖరిని సహించలేని ప్రజలందరూ లేచి బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాలను ఖండించడం ప్రారంభించారు సోవియట్‌కు - పోలిషు ప్రభుత్వానికి మధ్య సంబంధాలు తెగిపోవుటకు పూర్తి బాధ్యత పోలిషు ప్రభుత్వానిదే అని ప్రకటించారు. ఈ లోపల సోవియట్ ప్రభుత్వం ఫాసిస్టులతో హోరాహోరీ పోరాడుతూనే పోలిషు ప్రభుత్వంయొక్క కుట్రను ప్రపంచానికంతకూ వెల్లడిచేసింది. కొంతకాలానికి బ్రిటిషు ప్రభుత్వం గూడా పోలిషుప్రభుత్వాన్ని సమర్థించుట మానుకోవలసి వచ్చింది. అంతేగాక పోలిష్‌ప్రభుత్వ వైఖరిని గూడా చర్చిల్ బహిరంగంగా పార్లమెంటులో ఖండించాల్సి వచ్చింది. ఫాసిస్టులు, ఫాసిస్టు అనుకూలురు కలిసిచేసిన కుట్రను ఈ విధంగా సోవియట్ ప్రజలు, ప్రపంచప్రజలు భగ్నమొనరించారు.

# 7. పోలిష్ దేశభక్తుల స్వాతంత్ర్య ప్రకటన

"లండన్‌కు వలసపోయిన ఈ పోలిషుప్రభుత్వం ఎవరికి ప్రాతినిధ్యం వహిస్తుంది? పోలిషు ప్రజలకా? అసంభవం. పోలెండు ప్రజలు ఈ ప్రభుత్వాన్ని ఎప్పుడూ ఎన్నుకొనలేదు; తమకు ప్రతినిధిగా ఉండమని నియమించలేదు. ఏ హక్కులనుగూడా ఈ ప్రభుత్వానికి పోలిషుప్రజలు ఇవ్వలేదు. పోలెండునుంచి పారిపోయిన రిడ్జ్ - స్మిగ్లీ ప్రభుత్వం నుంచి బయలుదేరింది ఈ పోలిష్‌ప్రభుత్వం

"ఈ ప్రభుత్వంలో ఉన్నవారి చర్యలను మొదటినుంచీ గుర్తిస్తూ వచ్చాం. 1939 లో పోలెండు పతనానికి దారితీసిన పోలిషుప్రభుత్వ వర్గాలకు వీరికి ఏమీ భేదాలులేవు. వ్యక్తిగతంగా, సాంప్రదాయకంగా, సిద్ధాంత రీత్యా వారికి వీరికి లెక్కలేనన్ని సంబంధబాంధవ్యాలు ఉన్నాయి. ఈ విషయం మా కందరికి తెలుసు.

"పోలిషు సరిహద్దులను గురించి బేరమాడుటయే లండన్‌లో కూర్చున్న పోలిషు ప్రభుత్వంయొక్క ప్రధానకార్యక్రమం. పోనీ, ఈబేరం విషయంలోగూడా, జర్మన్లు ఆక్రమించిన పోలెండు ప్రాంతాలను గురించి మాట్లాడరు. మా సోదరులు, మాతో స్నేహంగా ఉండాలనికోరే సోవియట్ బైలోరష్యన్లు, యుక్రేనియన్లు, లిథూనియన్లకు చెందిన సోవియట్ బైలో రష్యా, సోవియట్ యుక్రెయిన్, సోవియట్ లిథూనియాలు కావాలంటుంది పోలిషుప్రభుత్వం ............... ఈ కారణాలవల్లనే సోవియట్ యూనియన్‌లో నివసిస్తున్న పోలిషుప్రజలమైన మేము యుద్ధంలో పాల్గొంటానికి ఆయుధాలు కోరాము. జెనరల్ ఆండర్స్ పోలిషు సైన్యాలను తీసుకొని మధ్య ప్రాచ్యదేశాలకు పోతున్నప్పుడు, వెంటనే సోవియట్ భూమిమీద నివసించే పోలిషు ప్రజలందరమూ సైనిక శిక్షణపొంది, నెలల తరబడీ గుడారాల్లో ఉండి కాలక్షేపణ చేయుటగాక, ఫాసిస్టు శత్రువులతో పోరుసల్పుటకై సోదర రెడ్‌ఆర్మీతో భుజం భుజం కలిపి పోరాడుటకు నిశ్చయించుకున్నాం. పోలిషుప్రజలు సోవియట్ ప్రజలు కలిసి సాగిస్తున్న సంయుక్త పోరాటంలో ప్రవహించే రక్తధారలే మా ఇద్దరిమధ్య స్నేహసంబంధాలను అభేద్యములుగా చేసినాయి. ఈ అభేద్యమైన సోదర సంబంధాన్ని ఎవరూ త్రెంచలేరు!"

— 52

ఈ మాటలను మాట్లాడుతోంది ఎవరు? పోలెండు ప్రజల స్వాతంత్ర్యమే పరమావధిగా పెట్టుకొని ఫాసిస్టులతో పోరుసల్పుతున్న పోలిషు దేశభక్తుల సంఘాధ్యక్షుడు వాండా వాసిలెవ్స్కా. వాండావాసిలెవ్స్కా ప్రఖ్యాతి గాంచిన పోలిష్ రచయిత అని ప్రపంచానికంతకూ తెలిసిన విషయమే. లండన్‌లోని విద్రోహక పోలిష్‌ప్రభుత్వ ధోరణికి, దేశభక్తితో ప్రతిధ్వనిస్తున్న ఈ దేశభక్తుని వాక్కులకు ఎంత వ్యత్యాసం ఉంది!

అయితే ఈ పోలిష్ దేశభక్తుల సంఘం యెక్కడిది? ఎప్పుడు ప్రారంభమయింది? ఈ సంఘంలో సభ్యులు యెవరు? ఈ సంఘ కార్యక్రమం ఏమిటి? ఈ విషయాలను పరిశీలిద్దాం.

సోవియట్ ప్రభుత్వ సహాయంతో పోలిష్ సైన్యాలను నిర్మించుకొని, పోలిష్ ప్రభుత్వం, ఆ సైన్యాలను సోవియట్ యూనియన్‌నుంచి ఖాళీచేసి ఇరాన్‌కు తీసికొనివెళ్ళినప్పుడు పోలిష్ ప్రభుత్వ నిర్ణయాన్ని ఖండించిన పోలిష్ దేశభక్తులనేకులు సోవియట్‌యూనియన్‌లో ఉన్నారు. వారి నాయకులలో ముఖ్యులు: పోలిష్ మిలిటరీ ఆఫీసర్లయిన కలనల్ బెర్లింగు; కలనల్ సివికి; ప్రసిద్ధిగాంచిన పోలిష్ రచయితలైన వాండా వాసిలివ్స్కా, స్టీఫాన్ ఎండ్రిచోవస్కీ; ప్రసిద్ధిగాంచిన పోలిష్ ప్రొఫెసర్ పార్నాస్; పోలిష్ కార్మికసంఘ నాయకుడైన విటాజివస్కీ; పోలిష్ పార్లమెంటు సభ్యుడైన 'విటోజ్'; గెరిల్లాలు తయారైన కూవ్స్వంటి పోలిష్ మతబోధకులు. ఇటువంటి నిజమైన పోలిష్ దేశభక్తులందరూ కలిసి, పోలిష్ దేశభక్తులను ఐక్యంచేయుటకై, ఈ సంఘాన్ని మాస్కోలో ప్రారంభించారు. పోలిష్ దేశభక్తులందరికీ పిలుపుయిచ్చారు. తమ మాతృదేశాన్ని ఆక్రమించిన ఫాసిస్టు దురాక్రమణదారులను హతంగావించమని ఉత్సాహపరిచారు. వెంటనే రెండు పోలిష్‌సైన్యాలను నిర్మించి, రెడ్‌ఆర్మీతో కలసి, ఫాసిస్టులతో పోరుసల్పుటకు ప్రారంభించారు.

ఈ పోలిష్ దేశభక్తుల సంఘం 'వోల్నాపోల్స్కా' అను పత్రికను నడుపుతోంది. పోలిష్ దేశభక్తుల సంఘం 5 ఆశయాలను విశదపరుస్తూ ఈమధ్యనే ఈపత్రిక ఒకస్టేట్‌మెంటును ప్రకటించింది. 5 ఆశయాలుఇవి:

(1) పోలెండుకు పశ్చిమాన జర్మన్లు ఆక్రమించిన ప్రాంతాన్ని తిరిగి స్వాధీనపరుచు కోవాలి.

(2) పశ్చిమ యుక్రెయిన్, బైలో రష్యా సోవియట్ యూనియనులో భాగాలుగానే ఉండాలి.

(3) ప్రజాస్వామిక పార్లమెంటరీ ప్రభుత్వం పోలెండులో యేర్పడాలి.

(4) విద్రోహకవర్గాల నన్నింటిని తుడిచివేసి, భూమినంతా రైతులకు పంపకంచేయాలి.

(5) ఏ రాజకీయ గ్రూపుకు చెందినాసరే పోలిష్ ప్రజలంతా (లండన్‌లోని పోలిష్ ప్రభుత్వం తప్ప) ఐక్యంకావాలి.

ఈ 5 ఆశయాలతోగూడిన ప్రకటన లండన్‌లో కూర్చున్న పోలిష్ ప్రభుత్వానికి ఒక హెచ్చరిక గూడా చేసింది. పోలిష్ ప్రభుత్వం ఇప్పుడైనా ఆకాశంనుంచి భూమిమీదికి దిగితే మంచిదని, యుగోస్లావియా ప్రభుత్వం వలె ఇప్పుడైనా నూతన రాజకీయపంథా అనుసరించుట అవసరమని ఈ ప్రకటన విజ్ఞప్తి గావించింది.

"ప్రపంచంలో పోలెండుకు ఉండవలసిన స్థానంగాని, లేక పోలెండులోపలి పరిస్థితులను సరిదిద్దే విషయంగాని, పోలిష్ ప్రజలే నిర్ణయించాలి. జాతీయ అంతర్జాతీయ విషయాలన్నిటిలో చొరవ పోలిష్ ప్రజలకే ఉండాలి లండన్‌లోఉన్న ప్రభుత్వానికి తెలివితేటలుగాని, చొరవగాని లేదని తేలిపోయింది. రాజకీయంగా ఆ ప్రభుత్వం ఆత్మహత్యగావించు కొన్నదనే చెప్పాలి.

పోలిష్ ప్రజాస్వామ్య శక్తులన్నీ వెంటనే పరిష్కారమార్గాన్ని వెదకాలి. లండన్ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ కూర్చున్నందువల్ల ప్రయోజనం లేదు. ఒకేరాజకీయ కేంద్రంక్రింద పోలిష్ దేశభక్తులనందరిని ఐక్యం చేయాలి. దేశభక్తుల ఐక్యతయే మన జాతీయ జీవనంయొక్క ఆధారం"

అని ఈ ప్రకటన దేశభక్తులను ఉద్బోధిస్తోంది. "సహృదయులైన ప్రజలందరియొక్క (పోలెండులోగాని, లండన్‌లోగాని,న్యూయార్కులోగాని ఎక్కడైనాసరే) సహాయాన్ని సంపాదించుటకు మనం కృషిచేద్దాం; కాని ఈ జాతీయైక్యత సిద్ధించాలంటే, శత్రువుకు వ్యతిరేకంగా, విద్రోహకవర్గాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటాన్ని పోలిషు దేశభక్తులంతా బలపరచాలి. ప్రత్యక్ష పోరాటంలోనే ఈ ఐక్యత సాధ్యపడుతుంది." అని పోలెండు దేశభక్తుల ప్రకటన ఐక్యతా కార్యక్రమాన్ని పోలెండు ప్రజలకు అందజేస్తోంది.

"జెకోస్లోవేకియా, యుగోస్లోవియా, ఫ్రాన్సు దేశాలలో నిర్మించబడినటువంటి జాతీయైక్యత మనకుగూడా అవసరం. ఫాసిస్టులతో పోరాడు

టకు తయారైన పోలిషు సైన్యాలను ఇరాన్, పాలెస్టయిన్, ఈజిప్టుల గుండా వృధాగా త్రిప్పిన పోలిషు ప్రభుత్వానికి పోలిష్ ప్రజల తరపున మాట్లాడుటకు హక్కు లేదు. పోరాటానికి సిద్ధపడినవారికే ఆ హక్కు ఉంటుంది"

పోలిష్ ప్రభుత్వముయెడల పోలిష్ ప్రజల వైఖరి ఎలా ఉన్నదో ఈ ప్రకటనలవల్ల తేటతెల్లమవుతోంది.

ఇక రైతులకు భూములను పంచే విషయంలో పోలిష్ దేశభక్తుల సంఘంయొక్క కార్యక్రమం చూద్దాం:—

"పోలిషుప్రజాస్వామిక సాంప్రదాయాలకు అనుగుణ్యంగా దేశపునర్నిర్మాణాన్ని సాగించుటకు ఐక్య దేశభక్తుల సంఘం కృషి చేస్తుంది. రాజకీయంగాగాని, ఆర్థికంగాగాని అభివృద్ధిని విరోధించే విద్రోహక శక్తులను నిర్మూలించి, వెంటనే పోలెండులోని భూమినంతటిని రైతులకు పంపకం చేస్తుంది.

"పోలెండు స్వాతంత్ర్యం చిరస్థాయిగా ఉండాలంటే, జర్మన్ శక్తులను విరోధించే పశ్చిమ సరిహద్దులను ఏర్పాటు చేసుకొని, పూర్వం పోలెండుకుచెందిన భూములను తిరిగి ఆక్రమించి, దేశ ఆర్థిక సౌభాగ్యానికి పాటుపడాలి. ఇక సోవియటుతోవున్న సరిహద్దుల విషయంలో ఇద్దరికి తృప్తికరంగానూ శాశ్వతంగా తగాదాలులేకుండానూ తోడ్పడే సంధిని చేసుకుంటాం" అని ప్రకటన తెలియజేస్తోంది.

ఇక పోలెండులో స్థాపించబోయే పోలిష్ ప్రభుత్వం యెలాంటిది? ఎప్పుడు స్థాపించబడాలి? అనే విషయాలను గురించిగూడా దేశభక్తుల ప్రకటన స్పష్టపరుస్తోంది.

"రెడ్ఆర్మీ వార్సా (పోలెండు ముఖ్యపట్టణం) లో అడుగుపెట్టుటతోపాటు నూతన పోలిష్ ప్రభుత్వం యేర్పాటు చేయబడుతుంది. ఈ నూతన ప్రభుత్వంలో సగంమంది, జర్మన్లు పోలెండును ఆక్రమించిన కాలంలో పోలెండులోనేవుండి జర్మన్లతో పోరాటం సాగించినవారై ఉండాలి. పోలిష్ జాతియొక్క ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణం యీ బాటలో నడుస్తుంది."

పైన ఉదహరించబడిన పోలిష్ పునర్నిర్మాణ కార్యక్రమం యేం తెలియజేస్తోంది? పోలిష్ ప్రజలే పోలెండు స్వాతంత్ర్యాన్ని, పోలెండు ప్రభుత్వాన్ని నిర్మించుకోబోతున్నారు. శతాబ్దాలతరబడి భూస్వాములక్రింద,

దోపిడీవర్గాలక్రింద పడరాని బాధలన్నీ పడి, యూరప్‌ఖండంలో ఎక్కడా లేనటువంటి దారిద్ర్యంలో చిక్కుకొని, ప్రభుత్వవర్గాల దౌర్జన్య హింసలకు గురియైన పోలిష్ బీద రైతాంగం చివరికి మానవ ప్రపంచంలో తల యెత్తి వారి రాజ్యాంగాన్ని, వారి వ్యవహారాలను వారే చక్కబెట్టుకోబో తున్నారు. ప్రభుత్వం దేశాన్నివదలిపెట్టి పారిపోయినా తమ జన్మభూమిని తాము ప్రేమించిన యిండ్లను, వాకిళ్ళను, కుటుంబాలను అంటిపెట్టుకొని యుండి హిట్లర్ దురాక్రమణదారులను యెదుర్కొంటూ వారుపెట్టే బాధలన్నీ పడ్డ పోలిష్ స్వతంత్ర ప్రజలు లేచి పోలెండు ఉజ్వల భవిష్యత్తును నిర్ణయించబోతున్నారు. ఈ కార్యక్రమంతో పనిచేస్తున్న పోలిష్ దేశభక్తుల సంఘాన్ని ఏ దేశానికిచెందిన దేశభక్తులైనా హర్షించకుండా ఎలా ఉండగలరు ?

పోలిష్ దేశభక్తుల ఆశయాలను 1941 లో పోలిష్ ప్రభుత్వానికి- సోవియట్ ప్రభుత్వానికి ఒడంబడిక జరిగినకాలంలోనే సోవియట్ ప్రభుత్వం అంగీకరించింది. బలమైనటువంటి స్వతంత్ర పోలెండు నిర్మాణానికి సోవియట్ ప్రభుత్వం యెప్పుడూ యెదురుచూస్తుందని స్టాలిన్ అప్పుడు సికోరస్కీతో చెప్పాడు.

యూరపియన్ రాజకీయాల పరిణామం, యుద్ధగతి గమనించే వారందరికీ పోలెండుస్వాతంత్ర్యం రెడ్ఆర్మీవిజయాలమీదగూడా ఆధారపడియున్నదని తెలుస్తుంది. పోలెండునుంచి నాజీ సైన్యాలను తరిమివేయుటకు ముందుకు సాగివస్తోంది రెడ్ఆర్మీ. రెడ్ఆర్మీ పోలెండులో ప్రవేశించుటతో పోలెండులో ప్రజలందరికి తిరిగి జీవం వస్తుంది. కాని లండన్‌లో పోలిష్ ప్రభుత్వానికో ? కంపరంవేస్తోంది. 1943 ఏప్రియల్ 25 వతేదీన పోలిష్ ప్రభుత్వ ఫాసిస్టు వైఖరివల్ల, దానితో సోవియట్ ప్రభుత్వం సంబంధాలను త్రెంచుకుంది. కాని పోలెండులో రెడ్ఆర్మీ ప్రవేశించేసరికి లండన్‌లో పోలిషు ప్రభుత్వానికి చలనంకలిగింది. ఇప్పుడైనా సోవియట్ ప్రభుత్వంపట్ల, పోలిషు దేశ భక్తులయెడల తన విద్రోహవైఖరిని పోలిషు ప్రభుత్వం మార్చుకున్నదా ? హిట్లర్ ఓటమి తప్పదనే పరిస్థితులు కల్గి, ఫాసిస్టులతో అంతిమపోరాటానికి సంఘటిత మవుతున్న అన్ని శక్తులతోపాటు పోలిషు ప్రభుత్వంగూడా కదిలి, ముందడుగు వేస్తున్నదా ? ఈ విషయాలనుగురించి మరుసటి ప్రకరణంలో పరిశీలిద్దాం.

# 8. పోలెండులో తిరిగి రెడ్ ఆర్మీ !!

1943 వేసవికాలంలో జర్మన్లు దిగ్భ్రిమచెందే పరిస్థితులు ఏర్పడినాయి. సోవియట్-జర్మన్ యుద్ధరంగంలో అంతవరకూ ప్రతిసంవత్సరం వేసవికాలంలో జర్మన్ సైన్యాలు ముందుకు పురోగమిస్తూ ఉండేవి. ఉండేవి. ఆ ఉద్దేశ్యంతోనే 1943 జూలై 5 వ తేదీన నాజీసైన్యాలు కుర్స్కు రంగంలో ముందుకు సాగిపోవుటకై కేంద్రీకరించబడినాయి. కాని పరిస్థితులన్నీ తల్లక్రిందులయినాయి. ఈ వేసవికాలంలో రెడ్ ఆర్మీ ముందుకు సాగివచ్చింది. హిట్లర్ దాడిని భగ్నంచేసి పోలిష్‌సరిహద్దుల వైపుకు రెడ్ఆర్మీ సాగిపోయింది.

పోలిష్ సరిహద్దులకు చేరుతున్న రెడ్ఆర్మీని చూసి లండన్‌లో ఉన్నపోలిష్‌ప్రభుత్వంలో సంచలనం బయలుదేరింది మళ్ళీ. 1943 డిసెంబరు 30 వ తేదీన పోలిష్ అధ్యక్షుని తరఫున పోలిష్ యుద్ధానంతర పునర్నిర్మాణ శాఖామంత్రి మాట్లాడుతూ " పోలెండులోని తూర్పుప్రాంతాలు మావి. అవి మాకు చెందినవే..................ఈ విషయంలో పోలిషు ప్రభుత్వం గట్టి నిర్ణయం గావించుకుంది " అన్నాడు ! తూర్పు ప్రాంతాలంటే సోవియట్ బైలోరష్యా, సోవియట్ పశ్చిమ యుక్రెయిన్ అని మనకు తెలిసిన విషయమే.

రెడ్ఆర్మీ పోలెండు సరిహద్దుకు 10 మైళ్ళ దూరంలో ఉన్నప్పుడే లండన్‌లోని పోలిషు ప్రభుత్వ పత్రిక : " పోలిషు సరిహద్దులకు రెడ్ఆర్మీ 10 మైళ్ళ దూరంలోకి వచ్చింది..................లండన్‌లోగాని, న్యూయార్కులోని ప్రతి సామాన్య పౌరునికీ, రెడ్ఆర్మీ దురాక్రమణదారుగా పురోగమిస్తున్నదీ లేక విముక్తిసైన్యంగా పురోగమిస్తున్నదీ అర్థమగుటలేదు " అని వ్రాసింది ! అంతటితో ఆగకుండా, పోలెండులోని పశ్చిమ యుక్రేనియన్లను, బైలోరష్యన్లను పోలిషుప్రభుత్వానికి అప్పజెప్పుతామని సోవియట్ ప్రభుత్వం వెంటనే హామీ ఇవ్వాలనిగూడా పోలిషుప్రభుత్వ పత్రిక డిమాండు చేసింది. సరిహద్దుకు 10 మైళ్ళ దూరంలో ఉన్నప్పుడేనా ఈ కోర్కెలు? ఈ కోర్కెలు హిట్లర్ మూకలకు తప్ప మరెవరికి సంతోషం కల్గిస్తాయి ?

రెడ్ఆర్మీ ముందుకు పురోగమిస్తున్న కొలదీ పోలిషుప్రభుత్వంలో కొద్దిగా మార్పువచ్చినట్లుగా కనబడింది. 1944 జనవరి 5 వ తేదీన

పోలిషు ప్రభుత్వం సోవియట్ ప్రభుత్వాన్ని ఉద్దేశిస్తూ ఒక ప్రకటన చేసింది. రెడ్ఆర్మీ పురోగమనంతో జర్మన్ల ఓటమి దగ్గరపడుతోందని, జర్మన్ దురాక్రమణ ప్రారంభమైనప్పటినుంచి 4 సంవత్సరాలపాటు పోలిషు జాతికి చెందిన ప్రజలందరూ హిట్లర్‌ను ఎదుర్కొని పోరాడారని, ఆ ఉద్దేశ్యం తోనే పోలిషు ప్రభుత్వం పోలెండులో ఒక రహస్య ఉద్యమాన్ని ఆర్గనైజ్ చేసిందని, అందువల్ల రెడ్ఆర్మీ పురోగమనంవల్ల పోలెండులో హిట్లర్ నుంచి విముక్తి గావించబడే ప్రాంతాలు, పోలిషుప్రభుత్వానికి అప్పజెప్పా లని, విముక్తిగావించబడిన ప్రాంతాలలోని ప్రజలకు, ఆస్తులకు తగిన రక్షణ రెడ్ఆర్మీ ఇవ్వాలని పూర్వం పోలెండుకు సంబంధించినంతవరకూ అమలులో ఉన్న అంతర్జాతీయ ఒడంబడికలను సోవియట్ ప్రభుత్వం గుర్తించాలని, ఈ లోపల పోలెండులో పనిచేస్తున్న రహస్య ఉద్యమ నాయకులకు రెడ్ఆర్మీతో తగాదాలు లేకుండా చేసుకుంటూ జర్మన్లను ఎదు ర్కొనమని కబుర్లు పంపబడినవనీ, సోవియట్ ప్రభుత్వంతో స్నేహ సంప్రతింపులను ప్రారంభించుటకు తయారుగా ఉన్నామని, సోవియట్‌తో తిరిగి సంబంధాలు ఏర్పడిన తరువాతనే పోలెండులో రహస్యంగా పని చేస్తున్న శక్తులు రెడ్ఆర్మీకి సహకారం చేస్తాయని పోలిషుప్రభుత్వం ఒక దీర్ఘమైన ప్రకటన గావించింది.

సోవియట్‌తో తిరిగి సంబంధాలు యేర్పడేవరకూ రెడ్ఆర్మీతో సహకారం చేయకూడదని పోలిషు ప్రభుత్వం ఈనాడుకూడా ప్రకటిస్తున్న దంటే దాని విద్రోహకస్వభావం స్పష్టపడుటలేదా? సోవియట్‌తో సంబం ధాలు ఏర్పడినపుడు సరే. కాని ఈనాడో: ఘోర సంగ్రామసమయంలో తన సర్వస్వాన్ని ఒడ్డి యుక్రెయిన్ రాష్ట్రంనుంచి వెనక్కు వెళ్ళకూడ దని రష్యాలో తనకు మిగిలిన చివరి కీలక కేంద్రాలను పట్టుకుని పోరాడు తున్న హిట్లర్‌తో రెడ్ఆర్మీ చావు బ్రతుకుల పోరాటం చేస్తున్న నేడో! రెడ్ఆర్మీతో సహకారంలేదనియా పోలిషు ప్రభుత్వం యిచ్చే సూచనలు?

"నిన్న, ఈ రోజు, ఎప్పుడూగూడా పోలిష్ ప్రభుత్వానికి సోవి యట్ యూనియన్, రెడ్ఆర్మీ బద్ధశత్రువులే" అని 'ప్రావదా' పత్రిక, మాస్కోనుంచి పోలిషు ప్రకటనమీద వ్యాఖ్యానం చేసింది.

జర్మన్లు ఆక్రమించిన తమ మాతృభూమిని గురించి పోలిషు ప్రభు త్వానికి దిగులే లేదు. రెడ్ఆర్మీతో కలిసి హిట్లరుతో పోరాడుతున్న బైలో రష్యన్లను, పశ్చిమయుక్రేనియన్లను తిరిగితమపెత్తనంక్రిందికితెచ్చుకొనటం

ఎలా? ఇదే పోలిషుఫాసిస్టు ప్రభుత్వంయొక్క ఆందోళన: హిట్లర్ మీద విజయం పొందాలనే ఆవేదన పోలిషు ప్రభుత్వంలో కనబడదు. పైగా హిట్లర్ మీద విజయం అంటే వీరికి భయంగూడా. ఎందుకంటే వారి మనస్సంతా సోవియట్ యూనియన్ ఎలా ఓడిపోతుందా అని ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటుంది. సోవియట్ యూనియన్ అపజయం పొందితే పోలిషు ప్రభుత్వ శక్తి బయట పడగలదని వారి అభిప్రాయం. కాని సోవియట్ యూనియన్ అపజయం పొందేదీ లేదు. వారి శక్తి పైకి వచ్చేదీలేదు. చరిత్ర నిరూపిస్తున్న ఈ యదార్థాన్ని పోలిషు ప్రభుత్వం గుర్తించలేదు.

పోలిషు ప్రభుత్వ ఆలోచన అంతా ఒక సూత్రంతో ఆరంభ మవుతుంది. సోవియట్ యూనియన్ అన్నిటికంటె పెద్ద శత్రువు - ఇదీ పోలిషు ప్రభుత్వ ప్రాథమిక సూత్రం

లండన్‌లో నడుపబడుతున్న పోలిషు పత్రికలన్నీ ఈ సూత్రం మీద ఆధారపడి వ్రాస్తూవుంటాయి. ఉదాహరణకు: "జర్మన్లు, బోల్షివిక్కులూ ఇద్దరూ మాకు సమాన శత్రువులే" "హిట్లరూ, స్టాలిన్ ఇద్దరూ ఒకేరకపు దయ్యాలు" "పోలెండు తూర్పుదిక్కునవున్న సోవియట్ సమాజము ఒక జంతు సమాజంగనుక, దాన్ని నాశనం గావించుట ప్రపంచ మేలుకు అవసరం" "మేము స్థిరంగా ఉండాలంటే రష్యా ఓడిపోవాలి, కనీసం బలహీనపడాలి" "బైలో రష్యన్లు పోలిషు ప్రజలకు బద్ధ శత్రువులు"........ ఈధోరణిలో లండన్‌లోని పోలిషు పత్రికలు పోలిషు ప్రభుత్వ సూచనల ప్రకారం వ్రాస్తూ, రెండోవైపునుంచి సోవియట్‌తో మేము స్నేహ సంబంధాలకు తయారుగా ఉన్నామని పోలిషు ప్రభుత్వం ప్రకటిస్తే మాత్రం నమ్మేదెవరు?

పోలిషు ప్రభుత్వంయొక్క భావాలు ఈవిధంగా ఉన్నాయి. ఇక వారి చర్యలో? సోవియట్ యూనియన్‌తో పోరాడే ఆదుర్దాతో, హిట్లరు వ్యతిరేక పోరాటాన్నిగూడా ఆపివేసి, పోలెండులో హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడుతున్న దేశభక్తిపూరిత సైన్యాలను జర్మన్లతోకలసి అణచడం ప్రారంభించారు. ఈ విషయాన్ని రుజువుచేసే ఉదాహరణలు ఇదివరకే కొన్నిటిని చూశాం. మరొక ఉదాహరణకూడా చూడండి:

లండన్‌లోని పోలిషు ప్రభుత్వంచే నియమించబడిన పోలెండులోని నొవోగోలా రాష్ట్రంలోని ప్రతినిధి పోలిషు ప్రజలకు "మిలిటరీ, రాజకీయ పరిస్థితులు రెండూ పరిపక్వానికి వచ్చేవరకూ శాంతంగా ఉండండి!"

అని ఆజ్ఞయిచ్చాడు. పోలిషు ప్రభుత్వానికి 1941, 1942, 1943 సంవత్స రాల్లో మిలిటరీ రాజకీయ పరిస్థితులు యింకా పరిపక్వదశకు రాలేదు!

పోనీ కనీసం శాంతంగా ఉండి, జర్మన్లతో పోరాడకపోయినా, తటస్థంగా అయినావున్నారా అనుకుంటే, లేదు! హిట్లరుతో కలిసి దేశభక్తులను హతం గావించటం ప్రారంభించింది పోలిషు ప్రభుత్వం. జర్మన్లు పోలెండును ఆక్రమించుకొని వున్నంతకాలం "అందరూ శాంతంగా ఉండండి" అని ఆజ్ఞ. ఇప్పుడు రెడ్ఆర్మీ పోలిషు సరిహద్దులను సమీపించే సమయంలో "సోవియట్ ప్రజల ప్రతీకారం తీర్చుకోండి" అనియా నినాదం! 1943 అక్టోబరులో పోలిషు ప్రభుత్వం పోలిషు ప్రజలకు ఇచ్చిన ఆజ్ఞ ఇదియేయని జ్ఞాపకముంచుకోవాలి.

రెడ్ఆర్మీ పోలెండుహద్దులను సమీపిస్తున్నకొలదీ పోలిషుప్రభుత్వం యొక్క ఫాసిస్టుస్వభావం మరింత ఎక్కువగా బహిర్గతమైంది. రష్యన్లను తమ బద్ధ శత్రువులుగా పరిగణించమని, వారితోచేరి పోరాడే గెరిల్లా దేశభక్తులను హతంగావించమని పోలిషు ప్రభుత్వం పోలెండులోని రహస్య ఉద్యమ నాయకులకు ఆజ్ఞలు పంపుతోంది. రెడ్ఆర్మీతో సానుభూతి చూపించిన 50మంది పోలిషు ఆఫీసర్లను పోలిషుప్రభుత్వం అరెస్టుగావించి జైలులో పెట్టింది!

ఇటువంటి ఫాసిస్టు పోలిషు ప్రభుత్వం తిరిగి సోవియట్‌తో సంప్రదించుటకు తయారుగా ఉన్నదని 1944 జనవరి 5 వ తేదీన ప్రకటన గావించిందని తెలుసుకున్నాం. దానికి సోవియట్ ప్రభుత్వం ఇచ్చిన సమాధాన సారాంశం ఇది:—

"పోలిషు ప్రభుత్వం చేసిన ప్రకటనలో కొన్ని సత్యదూరములైన విషయాలు పేర్కొనబడినాయి. పశ్చిమ యుక్రెయిన్, పశ్చిమ బైలోరష్యన్ ప్రాంతములలో నివసిస్తున్న ప్రజలే 1939 లో సోవియట్ యూనియన్‌లో చేరుటకు వోట్‌చేశారు. ఈ ప్రాంతాలలో నివసించే ప్రజలలో అధికసంఖ్యాకులు (నూటికి 95 గురు) పోలిషు జాతికి చెందినవారు కారు. వారు బైలోరష్యన్లు. 1921 రీగా ఒడంబడిక ప్రకారం జరిగిన అన్యాయం ఇప్పుడు అరికట్టబడింది. ఈ విధంగా ఈ ప్రజలు సోవియట్ రిపబ్లిక్కులుగా ఏర్పడుటవల్ల పోలెండుకు జరిగిన అన్యాయమేమీ లేకపోగా, పోలిషు ప్రజలకు తమ సోదరులైన బైలోరష్యన్లకు శాశ్వతమైన స్నేహ సంబంధాలు ఏర్పడుటకు అవకాశం కల్గింది పోలిషు ప్రభుత్వంతో స్నేహ

సంబంధాలను పెంపొందించుటకు సోవియట్ ప్రభుత్వం ఎప్పుడూ తయారుగానే ఉన్నది. కాని ఆ సంబంధం న్యాయసమ్మతమైన షరతులమీద, సోదర భావంమీద, పరస్పర గౌరవ-మీద ఆధారపడియుండుట అవసరం. జర్మన్లకు వ్యతిరేకంగా ఇద్దరూ కలిసి పోరాడే సూత్రంమీద ఆధారపడియుండాలి. సోవియట్ ప్రభుత్వానికి జెకోస్లోవేకియా ప్రభుత్వానికి ఈమధ్య జరిగిన ఒడంబడికలో పోలిషు ప్రభుత్వంగూడా కలవాలి. రెడ్ఆర్మీ జర్మన్ల ఓటమిని రోజురోజుకూ దగ్గరకు తీసుకొని వస్తోంది. జర్మన్ ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోలిషు ప్రజల స్వాతంత్ర్యం కొరకు పోరాడుతోంది. ఈ పరిస్థితులలో స్వతంత్రపోలెండు నిర్మాణసమస్య రోజురోజుకూ ముందుకు వస్తోంది. పశ్చిమ యుక్రెయిన్, పశ్చిమ బైలోరష్యాను కలుపుకుని స్వతంత్ర పోలెండును నిర్మించుట జరగని పని. పోలెండునుంచి జర్మన్లు లాక్కొన్న ప్రాంతాన్ని తిరిగి పోలెండులో కలపాలనుట న్యాయమైన విషయం. ఆ విధంగా నూతన పోలెండు నిర్మాణం సాధ్యపడుతుంది. అయితే పోలెండు తూర్పు సరిహద్దులను గురించి మనం చర్చించవచ్చును. 1939 సరిహద్దులే శాశ్వతమై ఉండాలని మేము చెప్పటలేదు. అవసరమైతే వాటిలో మార్పులు చేయుటకు మేము సిద్ధమే. పోలిషు ప్రజలు ఎక్కువగా ఉండే ప్రాంతాలను తిరిగి పోలెండుకు ఇచ్చుటకు మాకు అభ్యంతరంలేదు. ఆ పరిస్థితులలో 1919 లో నిర్ణయించబడిన కర్జన్ లైనును షుమారుగా అనుసరించవలసి యుంటుంది. ఈ విషయాలన్నీ పరిష్కరించబడేంత వరకూ జర్మన్లకు వ్యతిరేకంగా పోరాటం సాగించుటకై పోలిషుప్రజలకు-సోవియట్ ప్రజలకు మధ్యగల సంబంధమే, సోవియట్-పోలిషు ప్రభుత్వ సంబంధాలను నిర్ణయించగలదు. మిత్రమండలి దేశాలన్నిటియొక్క శ్రేయస్సునుబట్టి జర్మన్లకు వ్యతిరేకంగా రెండుదేశాల ప్రజలూ కలిసి పోరాడుట అవసరం."

ఇదీ సోవియట్ వైఖరి స్వతంత్రపోలెండు నిర్మాణానికి సోవియట్ ప్రభుత్వంగూడా ఎప్పుడూ ఎదురుచూస్తుందని, వెంటనే ఫాసిస్టువ్యతిరేక పోరాటంలో పోలిషు ప్రభుత్వంగూడా సహకారం చేయాలని స్పష్టపరుస్తూ, సరిహద్దుల విషయంలో రెండుదేశాలకు తృప్తికరంగా ఉండే న్యాయసమ్మతమైన సూచనలు ఇచ్చింది. సోవియట్ ఆశయాలు ఇంత స్పష్టంగా విశదపరిచిన తరువాతగూడా పోలిషు ప్రభుత్వంయొక్క వైఖరిలో మార్పు రాలేదు. పైన చెప్పబడిన సోవియట్ ప్రకటనకు జవాబుగా పోలిషు

ప్రభుత్వం 1944 జనవరి 14 వ తేదీన మరొక ప్రకటనగావించింది. రెండు దేశాలకు శత్రువైన హిట్లర్ మూకలతో పోరాడుతున్న సమయంలో, ఇక మీదట చర్చలు అనవసరమని, సోవియట్ ప్రభుత్వం ఒక్కటే పోలెండు భూములను గురించి తీసుకునే నిర్ణయాలను గుర్తించుట అసంభవమని, సోవియట్ ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకొనుటయే తన ఆశయమని, ఆ ఉద్దేశ్యంతో బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాలను మధ్యవర్తులుగా ఉండ మని పోలిష్ప్రభుత్వం కోరబోతున్నదనీ పోలిష్ ప్రభుత్వంయొక్క జవాబు. పోలిష్జాతికి చెందని యుక్రెయిన్, బైలో రష్యాలను గురించియే తగాదా అంతా. అయినప్పటికి వాటిని వదులుకొనుటకు ఇష్టంలేక, ఈ సారి ఆ ఊసుగూడా ఎత్తకుండా, ఆ విషయాన్ని గురించి సోవియట్ ప్రభుత్వం ఇచ్చిన సూచనలను గురించి తన అభిప్రాయంగూడా చెప్పకుండా పోలిష్ ప్రభుత్వం ప్రకటనచేస్తోంది. సోవియట్ ప్రభుత్వంయెడలగాని, హిట్లర్తో పోరాడే విషయంలోగాని పోలిష్ ప్రభుత్వంలో మార్పు ఏమీలేదు. తన సూచనల క్రింద పోలెండులో పనిచేస్తున్నవారందరికి యధాప్రకారంగా సోవియట్ వ్యతిరేక సూచనలు ఇస్తూనే వచ్చింది.

1944 జనవరి 17 వ తేదీన సోవియట్ ప్రభుత్వం పోలిషు ప్రభుత్వ ప్రకటనకు జవాబు ఇచ్చింది. కర్జన్లైన్ ఆధారంగా సోవియట్ - పోలిషు సరిహద్దుల తగాదాను పరిష్కరించవచ్చునని సోవియట్ ఇచ్చిన సూచన మీద తన అభిప్రాయంగూడా చెప్పకుండా సూచనను పోలిషు ప్రభుత్వం నిరాకరించింది. ఇక పోలిషు ప్రభుత్వంతో సంబంధాలు పునరుద్ధరించి ఒడంబడిక చేసుకునే విషయంలో-ఇలా ప్రవర్తిస్తున్న ప్రభుత్వంతో సంబంధాలు తెగిపోయి చాలాకాలం అయింది. సంబంధాలు లేనటువంటి ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకొనుట అసంభవం. ప్రక్కనే ఉన్న సోవియట్ యూనియన్తో స్నేహసంబంధాలు కల్పించుకొనుటకు పోలిషు ప్రభుత్వానికి ఇప్పటికిగూడా ఇష్టంలేదని ఆ ప్రభుత్వ వైఖరివల్ల స్పష్టంగా బోధపడుతోందని సోవియట్ ప్రభుత్వం జవాబిచ్చింది.

"సోవియట్ యూనియన్ ప్రక్కనే ఉన్న పోలెండులో ఎటువంటి ప్రభుత్వం ఏర్పడాలి? అనే విషయం సోవియట్ ప్రజలకు గూడా ముఖ్య సమస్యయే." అని జనవరి 19 వ తేదీన ప్రముఖ సోవియట్ పత్రిక "యుద్ధం, కార్మికవర్గం" వ్రాసింది.

రెడ్ఆర్మీ పోలిషు సరిహద్దులవైపుకు పురోగమిస్తున్నకొలదీ, పోలెండుసమస్య మరీముందుకు వచ్చింది. పోలిషుప్రభుత్వవైఖరిలో మార్పు లేకపోవుటచూసి అందరికీ బాధ కల్గింది. సోవియట్ విజయాలంటే భయ పడేవారియొక్క అండచూసుకుని పోలిషు ప్రభుత్వం తన పాత వైఖరినే అవలంబిస్తూవచ్చింది. బ్రిటిషు పార్లమెంటులో ఈ విషయంమీద ఆందో ళన బయలుదేరింది. ఫాసిస్టుగా ప్రవర్తిస్తున్న పోలిషు ప్రభుత్వమునకు బ్రిటిషుప్రభుత్వం యెందుకు మద్దత యిస్తోంది ? అనే ప్రశ్న ప్రతివారిని యెదుర్కొంది. దీనికంతటికీ వ్యతిరేకంగా అసమ్మతి తీర్మానాలు, ఆందో ళన యెక్కువైంది. బ్రిటిషుప్రభుత్వం లొంగకతప్పలేదు. 1944 ఫిబ్రవరిలో చర్చిల్ యుద్ధాన్ని, యూరపియన్ రాజకీయాలను సమీక్షగావిస్తూ పోలిషు-సోవియట్ సమస్యనుగురించి మాట్లాడక తప్పలేదు. సోవియట్‌పట్ల పోలిషు ప్రభుత్వం అవలంబిస్తూన్న వైఖరిని బ్రిటిషు ప్రభుత్వం బల పరచజాలదని చర్చిల్ బహిరంగంగా ప్రకటించాడు. పోలిషు ప్రభుత్వం యొక్క వైఖరిని బ్రిటిషుప్రభుత్వం ఖండించాల్సివచ్చింది. ప్రపంచ ప్రజల అభిప్రాయాన్ని లెక్కించకుండా ఉండే దినాలు గతించినాయి. ప్రజాందోళన గుర్తించబడింది. చర్చిల్ పోలెండు సరిహద్దులనుగురించి గూడా మాట్లాడాడు. లిథూనియానుంచి పోలిషుప్రభుత్వం వశపరచుకున్న 'విల్నా'ను బ్రిటిషు ప్రభుత్వం గుర్తించదనియు, సోవియట్‌కు - పోలెం డుకు సరిహద్దు కర్జన్‌లైన్ (1919)ను ఆధారంగా చేసుకొని ఉండాలని బ్రిటిషు ప్రభుత్వ అభిప్రాయమని చర్చిల్ అంగీకరించవలసివచ్చింది.

అంతేకాదు. పోలిష్ - సోవియట్ సరిహద్దులను గురించి తాను స్వయంగా మాట్లాడినట్లు, స్టాలిన్ సూచించిన సరిహద్దులు (బైలోరష్యా, పశ్చిమ యుక్రెయిన్ సోవియట్ యూనియన్‌లో తిరిగి కలుపబడి, పోలెండు సరిహద్దులు పశ్చిమానికి వ్యాపింపజేయుట) న్యాయ సమ్మతమైనవని, ఆ విధంగాచేసే పక్షంలో సోవియట్ - పోలిష్ తగాదాలు పరిష్కరింప బడుటయేగాక సోవియట్ మీదకు పూర్వంవలె (1920) పశ్చిమాన్నుంచి దాడిప్రయత్నాలు జరుపుటకు అవకాశాలు ఉండవని, సోవియట్‌కు అటు వంటి హామీ కల్గించుట న్యాయమని, స్వేచ్ఛాస్వాతంత్ర్యములు పూర్తిగాగల నిజమైన ప్రజాస్వామిక పోలెండును నిర్మించుటకు స్టాలిన్ ఎప్పుడూ సంసిద్ధుడేనని తనకు పూర్తిగా నచ్చచెప్పాడని చర్చిల్ పార్లమెంటులో చెప్పాడు.

సోవియట్ యూనియన్ యెడల పోలిష్‌ప్రభుత్వం అవలంబిస్తున్న వైఖరిని చర్చిల్ తీవ్రంగా ఖండించినా, పోలిష్‌ప్రభుత్వం తన పూర్వ వైఖరిని మార్చుకోలేదు. దాన్ని బలపరిచే సోవియట్ వ్యతిరేకులు బ్రిటన్ లోనూ, అమెరికాలోనూ ఇంకా ఉన్నారు. వారి అండను చూచుకుని పోలిష్‌ప్రభుత్వం, పోలిష్ పత్రికలు పూర్వధోరణిలోనే ప్రకటనలు చేస్తూ వచ్చినాయి. కర్జన్ లైనుకు తాము అంగీకరించమని ప్రకటించినాయి. సోవియట్‌కు సానుభూతి చూపించే ఫాసిస్టు వ్యతిరేకులగు పోలిష్‌సైనికు లను శిక్షిస్తూనే వచ్చింది. ఈ విధంగా జెనరల్ అండర్స్ సైన్యంలో ఉండే అనేకవేలమంది పోలిష్ సైనికులను, సోవియట్ - జర్మన్ యుద్ధరంగంలో జర్మనులకు వ్యతిరేకంగా పోరాడుతామని సూచించినందులకు జైళ్ళకు పంపింది. 700 మంది సైనికులకు 10—15 సంవత్సరాల వరకు శిక్ష విధించబడింది. లండన్‌లో ఉన్న పోలిష్‌యూదులను నానాబాధలూ పెట్టింది. లండన్‌లో ఉండే పోలిష్ పౌరులు సివిలియన్లుగా పరిగణింపబడరని, ప్రపంచంలో ఎక్కడ ఉన్నా పోలిష్ ప్రజలందరూ పోలిష్ ప్రభుత్వ అధి కారంక్రింద ఉండవలసిన మిలటరీ సైనికులుగా పరిగణించబడుదురని, అందువల్ల లండన్‌లోని పోల్సు ఎవరైనా సోవియట్‌కు సానుభూతిచూపిస్తే సైన్యంలోనుంచి తొలగించబడుటయేగాక శిక్షింపబడుదురని లండన్‌లోని పోలిష్‌ప్రభుత్వం వాదిస్తూ, ఆ విధంగా అనేకమందిని అరెస్టుచేసి జైళ్ళకు పంపింది! ఈ వైఖరిని సహించలేక పోలిష్‌ప్రభుత్వం యెడల గొప్ప అసంతృప్తి పెరిగి పార్లమెంటులోనూ, బయటగూడా ప్రశ్నలు వస్తుంటే ఈడెన్ (బ్రిటిష్ విదేశాంగమంత్రి) 1944 ఏప్రియల్‌లో పోలిష్‌ప్రభుత్వాన్ని మందలించవలసి వచ్చింది. బ్రిటిష్‌వైఖరి తమకు సుముఖంగాలేదని బ్రిటిష్ ప్రభుత్వంతో సంబంధాలు త్రెంచుకుని, అమెరికాకు విజ్ఞప్తిచేసుకుని తమకు-సోవియట్‌కు మధ్యగల తగాదాపరిష్కారానికి అమెరికన్‌ప్రభుత్వం మధ్యవర్తిత్వం చేయాలనే సూచనలు పోలిష్‌ప్రభుత్వ వర్గాలనుంచి బయలు దేరినవని డెయిలీ వర్కర్ పత్రికా విలేఖరి వ్రాశాడు.

పోలిష్ ప్రభుత్వంమీద అన్నివైపులనుంచి అసంతృప్తి ప్రబలు తోంది. బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిగూడా విముఖంగానే పరిణమిస్తోంది. రెడ్‌ఆర్మీ పోలెండులో ప్రవేశించినప్పటినుంచి, పోలెండులో హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడుతున్న పోలిష్ దేశభక్తులు, పోలెండుకు బైటవున్న దేశభక్తులు, లండన్‌లో పోలిష్ ప్రభుత్వ ప్రధానమంత్రియైన మికొలా

యాజిక్‌ను హెచ్చరిస్తూ, ఫాసిస్టులను బలపరిచే అభివృద్ధి నిరోధకులను ప్రభుత్వంలోనుంచి తొలగించాలని వత్తిడి యెక్కువ చేయసాగారు. సోవియట్‌తో తిరిగి సరియైన ఒడంబడికను చేసుకొనమనిగూడా ఆందోళన హెచ్చింది. పోలిష్ ప్రభుత్వ సైన్యాధిపతియైన సోస్నోవస్కీని, 'దేశరక్షణ' మంత్రియైన క్యూకీల్ మొదలైన ద్రోహులను పోలిష్ ప్రభుత్వంలోనుంచి తొలగించమని ఆందోళన పెరిగింది. ప్రధానమంత్రి అయిన మికొలాయాజిక్ ఆందోళనకు ఆగలేక, పైన ఉదహరించబడిన 'ప్రముఖులు' తొలగిపోవాలని సూచించినంతమాత్రాన వారందరూ ప్రధానమంత్రిమీద మండిపడ్డారు. మికొలాయాజిక్ రాజీనామా యిచ్చుటకు తయారైనాడు. లండన్‌లోని పోలిష్ ప్రభుత్వం యీవిధంగా తయారైంది. అభివృద్ధి నిరోధకులను, సోవియట్ వ్యతిరేకులను యెక్కువమందిని ప్రభుత్వ మంత్రివర్గంలోకి తీసుకొనివచ్చి ప్రభుత్వ స్వభావాన్ని మరింత ఫాసిస్టుగా తయారుగావించాలని సోస్నోవస్కీ కుట్రలు ప్రారంభించాడు (44 ఏప్రియల్).

పోలిష్ ప్రభుత్వంలో వున్న దేశరక్షణశాఖ సహాయమంత్రి అగు డాక్టర్ మాడెల్‌స్కీ యీ ఫాసిస్టు విద్రోహులముఠాకు వ్యతిరేకి. ఈ ముఠాకుచెందిన 8 మంది ఆఫీసర్లను పదవులనుంచి తొలగించాలని డాక్టర్ మాడెల్‌స్కీ కోరాడనే కోపంతో సోస్నోవస్కీ (సైన్యాధిపతి) మాడెల్‌స్కీని అతని దేశరక్షణశాఖ ఆఫీసులోకి అడుగుపెట్టకుండా చేయమని ఆఫీసు కాపలావారికి ఆజ్ఞలు యిచ్చాడు.

సోస్నోవస్కీ అంతటితో ఆగలేదు. సోవియట్‌కు వ్యతిరేకంగా తిరిగి కుట్రలు ప్రారంభించాడు. పోలెండులో ప్రవేశించిన రెడ్‌ఆర్మీకి తన అనుచరులందరూ యెట్టి షరతులులేకుండా జర్మన్లకు వ్యతిరేకపోరాటంలో సహకారం చేయమని తాను ఆజ్ఞలు పంపినా, సోవియట్ ప్రభుత్వం తన అనుచరులను అరెస్టు చేసిందని, వారిగతి ఏమైందోగూడా తెలియలేదని తిరిగి ప్రచారంచేశాడు, కాని ఈసారి నమ్మేదెవరు? హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడేవారిని జైళ్ళకు పంపుతున్నది పోలిష్ ప్రభుత్వంగాని, సోవియట్ ప్రభుత్వంకాదని ప్రపంచానికంతకూ తెలుసు. అటువంటి ప్రపంచంచేత అబద్ధాలు నమ్మించాలని సోస్నోవస్కీ యింకా ప్రయత్నించుట వల్ల ఏం ప్రయోజనముంది? ఒకవైపునుంచి ఈ అబద్ధ ప్రచారంగావిస్తూ సోస్నోవస్కీ యధాప్రకారంగా తన సోవియట్ వ్యతిరేక ఆజ్ఞలను పోలెండులో ఉన్న తన అనుచరులకు పంపుతూనేవున్నాడు. 1944 ఏప్రియల్‌లో

ఇటలీలో ఉన్న పోలిష్ సైన్యాలను తనిఖీచేయుటకు వెళుతూ సోస్నోవస్కీ-పోలెండులోవున్న అనుచరులకు యేం సందేశం పంపాడో చూడండి! పోలెండులో విముక్తి అయిన ప్రాంతంలో తన అనుచరులయొక్క సివిల్ ప్రభుత్వ అధికారాలను సోవియట్ ప్రభుత్వం గుర్తిస్తేనే రెడ్ఆర్మీతో సహకారం చేయమన్నాడు।

రెడ్ఆర్మీ పోలెండులో ప్రవేశించినప్పటినుంచి పోలిష్ ప్రభుత్వం యొక్క సోవియట్ వ్యతిరేకధోరణి మరీ యెక్కువయిందని పై ఘటనలు అన్నీ నిరూపిస్తాయి ప్రభుత్వం ఈ విధంగా ఉంటే, పోలిష్ ప్రజలు మరొక ధోరణిలో నడుస్తున్నారు. పోలెండు లోని దేశభక్తులు, సోవియట్ యూనియన్‌లో ఏర్పడిన దేశభక్తుల సంఘం, ఇంగ్లండు అమెరికాలలో ఉన్న పోలిష్ దేశభక్తులు రెడ్ఆర్మీతోచేరి హిట్లర్ ఓటమికై సర్వమూ ఒడ్డి పోరాడుటకు ముందుకువస్తున్నారు. సోవియట్ - జర్మన్ యుద్ధరంగంలో పోరాడుతున్న పోలిష్ సైన్యాల అధిపతిఅయిన జెనరల్ బెర్లింగ్ : "స్వతంత్ర పోలెండుకు దగ్గర మార్గం రష్యాలోనుంచి, కాని ఇటలీనుంచి కాదు" అని హెచ్చరిస్తున్నాడు. సోవియట్ యూనియన్‌లో కొత్త పోలిష్ సైన్యాలు నిర్మించబడి యుద్ధరంగానికి పంపబడుతున్నాయి. 1863 లో పోలెండు నిరంకుశాధిపతులకు వ్యతిరేకంగా పోరాడిన వీర పోలిష్ సైన్యాధిపతి అయిన రొవోల్డ్ ట్రాగూట్ పేరిట ఒక కొత్తసైన్యం తయారై పోలెండు స్వాతంత్ర్యం కొరకై 44 మార్చిలో హిట్లర్‌కు వ్యతిరేకంగా యుద్ధరంగంలోకి దుమికింది. అమెరికాలోఉన్న పోలిష్ రోమన్ కాథలిక్ మతబోధకుడైన ఓర్లమిస్కీ మాస్కోకువచ్చి స్టాలిన్ మొలటోవులతో చర్చించి స్వతంత్రపోలెండుకై అమెరికాలో ప్రచారం గావించుటకై తిరిగి వెళ్ళాడు. స్వాతంత్ర్యాన్ని కోరేపోలిష్ దేశభక్తులంతా, ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో అగ్రగామిగా పోరాడుతున్న రెడ్ఆర్మీ పక్షాన చేరి పోరాడుతున్నారు. పోలెండులో తిరిగిరెడ్ఆర్మీ ప్రవేశించుటవల్ల దేశభక్తుల ఐక్యసంఘటన అసమానంగా బలపడింది. దేశభక్తిని ప్రధానంగా పాటించని పోలిష్ ప్రభుత్వం ప్రజలకు మరింత దూరమైంది.

# 9. కనుచూపుమేరలో పోలెండు స్వాతంత్ర్యం

పోలిష్ ప్రభుత్వం, బ్రిటన్ అమెరికాలలో దానికి ప్రోత్సాహం ఇచ్చే సోవియట్ వ్యతిరేకులు, హిట్లర్ ఓటమికి భయపడే ఫాసిస్టుముఠాలు అందరూ కలసి సోవియట్‌కు వ్యతిరేకంగా ఎన్నికుట్రలుచేసి ఎంత అబద్ధ ప్రచారం చేసినా, హిట్లర్ దురాక్రమణదారులను నాశనం గావిస్తూ రెడ్ ఆర్మీ పురోగమించింది. తమ స్వాతంత్ర్యాన్ని నాశనం చేయబూనిన నాజీ దురాక్రమణ దారులను చీల్చి చెండాతున్న రెడ్‌ఆర్మీని యూరపియన్ ప్రజలు విముక్తి సైన్యంగా పరిగణిస్తూ వచ్చారు. ఫాసిస్టు హంతకుల బారినుండి మానవ నాగరికతను కాపాడిన రెడ్ ఆర్మీ, సోవియట్ ప్రజలంటే ప్రపంచ ప్రజలందరికి సానుభూతి ఎక్కువయి, జోహారు లర్పించుటకు ప్రారంభించారు. సోవియట్ వ్యతిరేకులు సాగించే కుట్రలన్నిటిని ఎప్పటి కప్పుడు మెలకువతో కనిపెట్టుతూ సోవియట్ ప్రభుత్వం వాటిని భగ్నం చేయుటకు చేసిన కృషికి తోడుగా ప్రపంచ ప్రజలుగూడా అన్నిదేశాల్లో నిలబడ్డారు. ఫాసిస్టుల కుట్రలు, పోలిష్ ప్రభుత్వంయొక్క కుట్ర భగ్న మయ్యాయి. పోలిష్ ప్రభుత్వాన్ని బలపరచిన సామ్రాజ్యవాద ప్రభుత్వాల అధిపత్య యత్నాలుగూడా విఫలమయినాయి. రెండవ రంగాన్ని ఆలస్యం గావించి, ప్రత్యేక సంధికై ఆందోళన చేసిన ఫాసిస్టు సానుభూతి పరుల ఆశలు నిరాశలయినాయి. 3 సంవత్సరాలు ఒంటరిగా నిలబడి నాజీలను ఎదుర్కొన్న సోవియట్ ప్రజలకు తోడుగా, రెండవరంగం (44 జూన్ 5, 6 తేదీలలో) ప్రారంభించబడింది. అన్నివైపులనుంచి హిట్లర్‌ను ఎదు ర్కొనే ప్రజాశక్తులు విజృంభిస్తున్నాయి. హిట్లర్ ఓటమి కనుచూపు మేరలో పడింది. హిట్లర్ ఓటమితో యూరపియన్ దేశాల స్వాతంత్ర్య సమస్య ముందుకు వస్తోంది. యూరపియన్ దేశాలన్నితోపాటు పోలెండు స్వాతంత్ర్య సమస్యగూడా నేటి ఎజెండాలో ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తోంది.

కాని పోలెండు ప్రజల స్వాతంత్ర్యాన్ని అడ్డుకునే పోలిష్‌ప్రభుత్వం లండన్‌లోవుంది. పోలెండు స్వాతంత్ర్యాన్ని హిట్లర్‌కు ఒప్పజెప్పి దేశాన్ని

విడిచి పారిపోయిన ఈ ప్రభుత్వం యిప్పుడు హిట్లర్ ఓటమితో తిరిగి పోలెండులో ప్రవేశించి పరిపాలనాధికారం సాగించాలని చూస్తోంది. "పోలెండు మా దేశం. పోలెండు ప్రభుత్వం మేము" అంటూ లండన్ నుంచి పోలిష్ ప్రభుత్వవర్గాలు తమకోర్కెను ప్రకటిస్తున్నాయి. ఈ ప్రభుత్వానికి అండగా బ్రిటిషు, అమెరికన్ ప్రభుత్వాలు ఉన్నాయి. పోలిష్ ప్రభుత్వంయొక్క సోవియట్ వ్యతిరేక ధోరణిని చర్చిల్ ఖండించాడు గాని, పోలిష్ ప్రభుత్వాన్ని యింకా బ్రిటిషు, అమెరికను ప్రభుత్వాలు బలపరచుటకు ప్రయత్నిస్తూనేవున్నాయి. ఈ అభివృద్ధి నిరోధక శక్తులను వ్యతిరేకిస్తూ పోలిష్ దేశభక్తుల సంఘం పోలిష్ ప్రజలను ఐక్యం చేస్తూ నాజీ సైన్యాలతో పోరాడుతోంది. "లండన్‌లోవున్న పోలిష్ ప్రభుత్వము పోలిష్ ప్రజల ప్రతినిధికాదు. పోలెండు ప్రజలు వారిని ఎప్పుడూ యెన్నుకొనలేదు" అని పోలిష్‌ప్రజలు బాహాటంగా ప్రకటిస్తున్నారు. హిట్లర్‌కు వ్యతిరేకంగాసాగించే ఐక్య స్వాతంత్ర్య పోరాటంద్వారా నూతన స్వతంత్ర పోలిష్ ప్రజలు నూతన చైతన్యంతో ముందుకువచ్చి నూతన ప్రజా పోలెండును నిర్మించుటకు సమాయత్త మవుతున్నారు. కాని లండనులో కూర్చున్న పాత పోలిష్ ప్రభుత్వానికి పోలెండులోగాని, యూరపులోగాని, ప్రపంచంలోగాని వస్తూన్న నూతన మార్పులు గోచరించుట లేదు. నూతన పోలెండులో తమ పాత (నిరంకుశ) ప్రభుత్వాన్ని రుద్దాలని వారు ఆశిస్తున్నారు. నూతన పరిస్థితులలో పాత ఎత్తులు పనిచేయవని చరిత్ర నిరూపిస్తున్న పాఠం పోలిష్ ప్రభుత్వం తన జీవితంలో నేర్చుకోలేదు !

ఒక్క పోలిష్ ప్రభుత్వమేకాదు. హిట్లర్ యూరప్ ఖండంలో ఒక దేశం తరువాత మరొకదేశాన్ని ఆక్రమించినపుడు, ఆ యా దేశాల ప్రభుత్వవర్గాలు స్వదేశాలను ప్రజలను వదలి లండన్ చేరుకున్నారు. లండన్‌లో బ్రిటిష్ ప్రభుత్వ ఆశ్రయంక్రింద ఉంటూవచ్చారు. లండనులోవుండి, అప్పటినుంచి పోలిష్ ప్రభుత్వం ఏంచేస్తూవచ్చిందీ వివరంగా తెలుసుకున్నాం. సోవియట్ వ్యతిరేక ప్రచారం ప్రధాన కార్యక్రమంగా పెట్టుకొని, తమ దేశంలోని స్వతంత్ర పోరాటశక్తులనుగూడా అణచివేయుటకు, జర్మన్లతోగూడా చేతులుకలిపింది పోలిష్‌ప్రభుత్వం. పోలెండులో ప్రజావుద్యమం బలపడటం పోలిష్ ప్రభుత్వానికి కంటకమైంది. అదే విధంగా యుగోస్లావ్, గ్రీక్ ప్రభుత్వాలుగూడా ఫాసిస్టులకు సహాయపడే

కట్టులు సాగిస్తూవచ్చినాయి. యుగోస్లావ్ రాజైన పీటర్‌కు, గ్రీక్‌రాజైన జార్జికి ఇంకా తమ దేశాలమీద పూర్వంవలె నిరంకుశ పరిపాలన సాగించాలని ఆశ। కాని వారి ఆశలన్నీ నిరాశలైనాయి వందల సంవత్సరాల నుంచి ఈ పాత నిరంకుశ ప్రభుత్వాలక్రింద బాధలుపడ్డ యుగోస్లావ్, గ్రీక్ ప్రజలు నేడు తమ జన్మభూమి స్వాతంత్ర్యంకొరకు హిట్లర్‌కు వ్యతిరేకంగా అభేద్యమైన జాతీయ ఐక్యతను నిర్మించుకున్నారు. అజేయమని అనుకున్న హిట్లర్ సైన్యాలను నాశనంగావిస్తూ రెడ్ఆర్మీ విజయాలు వీరి జాతీయ ఐక్యతా పోరాటాలను ఉత్తేజపరచినాయి. యుగోస్లావియాలో, గ్రీసులో, పోలెండులో నేడు దేశభక్తుల ఐక్యకమిటీలు, గెరిల్లా సైనిక కేంద్రాలు దేశవ్యాపితంగా నిర్మించబడి పనిచేస్తున్నాయి.

పోలెండు, యుగోస్లావియా, గ్రీసుదేశాల్లో మాత్రమేకాదు. ఇటలీ, ఫ్రాన్సు, నార్వే, డెన్మార్కు....హిట్లరు క్రింద బాధపడ్డ ప్రజలందరూ తిరిగి లేస్తున్నారు. జాతీయైక్యత నిర్మించుకుంటూ పోరాటంలో పాల్గొంటున్నారు. ఇటలీతో పాతప్రభుత్వం పోయింది. విక్టర్ ఇమాన్యుయల్‌రాజు, మార్షల్‌బడోగ్లియోలు ప్రజాఉద్యమంముందు, ప్రపంచప్రజల ఆందోళన ముందు ఆగలేక రంగాన్నివదిలి విరమించుకోవలసివచ్చింది. ఇటలీలోని దేశభక్తిపూరితమైన ప్రజాపక్షాలన్నీకలిసి, ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి కొని నాజీలను హతంగావిస్తున్నారు. ఫ్రాన్సులో స్వతంత్ర ఫ్రెంచికమిటీ నాయకత్వంక్రింద 20లక్షల గెరిల్లా సైన్యం నిర్మించబడి హిట్లర్ ఫ్రాన్సును ఆక్రమించిననాటినుంచి నాజీలకువ్యతిరేకంగా పనిచేస్తూవచ్చింది. ఫ్రాన్సులో ఈనాడు ప్రజలంతా ఒకేపక్షంలోకి వచ్చారు. స్వాతంత్ర్యపిపాసయే ఈజాతీయైక్యతకు మూలాధారం. స్వతంత్ర ఫ్రెంచియూనిట్లు ప్రతి పట్టణంలోను ప్రతి పల్లెలోనూ ఏర్పడి నాజీలకు పక్కలో బల్లాలవలె తయారైనాయి. రెండవరంగం ప్రారంభించినప్పటినుంచి ఫ్రెంచిసైన్యాలన్నీ ప్రతిప్రాంతంలో నాజీలను వేటాడుటకు ప్రారంభించినాయి. పారిస్ పట్టణంలో నాజీలకు, స్వతంత్ర ఫ్రెంచిప్రజా సైన్యాలకు వీధివీధిలో పోరాటాలు ప్రారంభమయినాయి. నార్వే, డెన్మార్కు దేశాలలో గూడా ఇదే కథ. జాతీయైక్యతా ఆయుధంమీద ఆధారపడి ఏదేశంలోని ప్రజలు ఆదేశంలో నిలబడి స్వాతంత్ర్యం కొరకు పోరాడవలసిన సమయం వచ్చింది. పోరాడుతున్నారు. పోరాడినకొలదీ, జాతీయైక్యత ప్రతిదేశంలో ఉచ్ఛస్థాయికి వెళ్ళింది. పోలెండులో కూడా అంతే. యూరపియన్ రాజకీయాల పరిణామంలో

ఏర్పడిన నేటిపరిస్థితి ఇది. నూతన ప్రజారాజకీయాలు, నూతన ప్రజా యూరప్‌కు పునాదులు నిర్మించబడుతున్నాయి. ఇదీ నేటి యూరపియన్ పరిస్థితి.

ఫాసిస్టుప్రమాదం యూరప్‌ఖండ ప్రజలనందరిని ఎదుర్కొంది. హిట్లర్ యూరపియన్ దేశాల నన్నిటిని ఆక్రమించుకొని అందరి స్వాతంత్ర్యాన్ని హరించాడు. అందువల్ల హిట్లర్ యూరపియన్ ప్రజలందరికి శత్రువయినాడు. అందరికీ శత్రువులైన నాజీలను నాశనంగావించుటకు ప్రతిదేశంలో ప్రజలు ఐక్యమై పోరాడుతున్నారు. ఏ ఒక్క దేశంలో జరిగే పోరాటమైనా అన్నిదేశాల ప్రజలకు సహాయపడింది. అందువల్ల ప్రతి దేశప్రజలయొక్క స్వాతంత్ర్యపోరాటం యూరపియన్‌ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో ఒకభాగంగా పరిణమించింది. ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా యూరపియన్ ప్రజలందరిమధ్య ఐక్యత నిర్మించబడింది. ఫ్రెంచిగెరిల్లాలు, ఇటాలియన్ దేశభక్తులు, గ్రీక్ రహస్యపోరాట శక్తులు, యుగోస్లావ్ గెరిల్లా దళాలు, పోలిష్ దేశభక్తుల సంఘం మొదలైన పోరాటశక్తులన్నీ యూరపియన్ ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో భాగాలు. ఫాసిస్టు వ్యతిరేక పోరాటం ప్రతిదేశంలో ఐక్యత నిర్మించుటయేగాక వివిధ యూరపియన్ దేశప్రజల మధ్యగూడా ఐక్యతకు దారితీసింది.

ఒక్క యూరపియన్ దేశాలలోనేకాదు యూరప్ ఖండాన్ని ఆక్రమించిన హిట్లర్ రష్యామీదపడిన రోజున ఫాసిస్టు ప్రమాదం ప్రపంచ ప్రజలందరికి ప్రమాదంగా పరిణమించింది. సోవియట్ యూనియన్‌ను హిట్లర్ ఆక్రమించి జపాన్‌తో ఐక్యమయితే ; ఆసియాఖండానికి, ఆఫ్రికా ఖండ ప్రజలకు, అమెరికాఖండ ప్రజలకు అందరికీ ఫాసిస్టు బానిసత్వమే గతి అయి ఉండేది. ఆ ప్రపంచ ప్రమాదపరిస్థితులలో, యూరపియన్‌దేశాల్లో వలె, అన్నిదేశాల్లోకూడా జాతీయైక్యతా ఉద్యమాలు బయలుదేరి అందరి క్షేమంకొరకు ప్రతివారు ఫాసిస్టు వ్యతిరేకంగా పోరాడుటకు ముందుకు వచ్చారు. ప్రపంచాన్నంతనూ తమ బానిసత్వం క్రిందకు తీసుకొని వచ్చుటకు ప్రయత్నించిన ఫాసిస్టు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ప్రపంచ ప్రజలందరూ ఐక్యమగుటకు అవకాశం వచ్చింది. ఐక్యమవుతున్నారు.

ఈ విధంగా ప్రారంభమయిన ప్రపంచ ప్రజాస్వాతంత్ర్య పోరాటాన్ని రెడ్‌ఆర్మీ విజయాలు ఉత్తేజ పరిచినాయి. హిట్లర్ సైన్యాలను అంతవరకూ ఎవరూ ఎదుర్కొనలేకపోయారు. సోవియట్ ప్రజలు తమ

అసమాన ఐక్యతతో నిలబడి ఫాసిస్టులను ఎదుర్కొని, జర్మన్ జపాన్ ఫాసిస్టులు ఇద్దరూ ఐక్యంగాకుండా మధ్యనిలబడి స్టాలిన్‌గ్రాడ్‌వద్ద నాజీలను హతం గావించింది రెడ్‌ఆర్మీయొక్క అజేయశక్తి సామర్థ్యాలు ప్రతిదేశ ప్రజలయొక్క స్వాతంత్ర్య పోరాటాన్ని ఉత్తేజ పరిచినాయి. ప్రతిదేశంలో నిర్మించబడుతున్న జాతీయైక్యతా ఉద్యమానికి ఐక్యసోవియట్ ప్రజలకుమధ్య పూర్వం ఎప్పుడూ లేనటువంటి స్నేహభావం, నమ్మకం, పరస్పర అభిమానం ఏర్పడినాయి. ఈ విధంగా ప్రత్యక్ష పోరాటంద్వారా ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తున్న సోవియట్‌ప్రజలు అగ్రగాములుగా ముందు నడుస్తుంటే, ప్రపంచ ప్రజలందరూ రోజురోజుకు ఐక్యమై బలాన్ని పెంపొందించుకుంటున్నారు. ఈ ప్రపంచ ప్రజల ఐక్యతా బలాలు ప్రతిదేశ ప్రజల స్వాతంత్ర్య పోరాటానికి అండగా నిలబడి పనిచేస్తున్నాయి. పోలెండులోని దేశభక్తుల నందరిని ఐక్యం చేస్తూ ప్రత్యక్షంగా పోరాటాన్ని నడుపుతున్న పోలిష్ దేశభక్తుల సంఘానికి వెనుకగూడా ఈ నూతన ప్రపంచ ప్రజాఐక్యతబలం అండగా ఉంది.

అయితే, ఈవిధంగా ఫాసిస్టులను నాశనం గావించి స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకై నిర్మించబడుతున్న ఐక్యతాబలాలను సహించలేని శక్తులు ఇంకా ఉన్నాయి. హిట్లర్ ఓటమి అప్పుడే కన్పిస్తోంది. హిట్లర్ ఓటమితో జపాన్‌గూడా క్రుంగిపోవలసిందే. ఆ రోజులుగూడా దగ్గరపడుతున్నాయి. కాని ఈ ఫాసిస్టుల ఓటమికి దారితీసిన సోవియట్ ప్రజలబలం, వివిధదేశ ప్రజలయొక్క ఐక్యతా ఉద్యమాలను చూసి భయపడేవారు అన్నిదేశాల్లో ఇంకా ఉన్నారు. అలాంటి విద్రోహక శక్తులలో పోలిష్ ప్రభుత్వం ఒకటని వివరంగాని రూపించబడింది. పాత ప్రభుత్వాలకు, రాజులకు, రాచరికాలకు, హిట్లర్ ఓటమిలో తమ ఓటమిగూడా కన్పిస్తోంది. నూతన చైతన్యంతో ఎన్నడూ ఐక్యంకాని ప్రజలు ఈనాడు ప్రతిదేశంలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఐక్యమయిన తరువాత పాత నిరంకుశ పరిపాలక వర్గాలను ఎలా సహించగలరు? హిట్లర్ ఆక్రమణకు తోడ్పడిన విషీప్రభుత్వం మా ప్రతినిధి కాదని ఫ్రెంచిప్రజలు; బడోగ్లియో ప్రభుత్వం ప్రజాప్రభుత్వం కానేరదని ఇటాలియన్ ప్రజలు; జార్జిరాజు మాకు ప్రభువుగా అవసరంలేదని గ్రీస్ ప్రజలు; పీటర్‌రాజు యుగోస్లావియాకు వస్తే అతని ప్రాణాలకు మేము బాధ్యులం కాజాలమని యుగోస్లావ్ ప్రజలు; పోలిష్ ప్రభుత్వం పోలెండు ప్రజల ప్రతినిధి కానేరదని పోలెండు ప్రజలు బహిరంగంగా ప్రకటించే

రోజులు వచ్చిన తరువాత పాత ప్రభుత్వాలన్నీ తమ అధికారాలకు తిలోద కాలు వదలుకోవలసి వస్తోంది.

పాత ప్రభుత్వాలు మాత్రమేకాదు ఆశలు వదులుకోవలసివస్తోంది. ఈ పాత ప్రభుత్వాలను ఇంతకాలం సంరక్షించిన బ్రిటిష్ అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆశలుకూడా నిరాశలవుతున్నాయి. ఈ పాత ప్రభుత్వాలను అడ్డుపెట్టుకొని, వారిని తిరిగి యధాస్థానాల్లో ప్రవేశపెట్టి, యూరపియన్ రాజకీయాల్లో తమ ఆధిపత్యం నిలబెట్టుకుందామని, యూరపియన్ రాజకీయాల్లో ఆధిపత్యంద్వారా (హిట్లర్ పతనంతరువాత) ప్రపంచ ఆధిపత్యం నిలబెట్టుకుందామని ఆశించే సామ్రాజ్యవాదుల ఎత్తులన్నీ భగ్నమవుతున్నాయి. యూరపియన్ దేశాల్లో నూతనంగా నిర్మించబడుతున్న ప్రజా స్వాతంత్ర్య కమిటీలను, ఉద్యమాలను గుర్తించవలసివచ్చింది. ఇష్టం వున్నా లేకపోయినా ప్రజావుద్యమాలు వెనుకనుంచి ఒత్తిడి చేస్తుంటే ముందుకు కదిలి సోవియట్ యూనియన్‌తో దగ్గర సంబంధాలు ఏర్పరచుకొని, రెడ్‌ఆర్మీతోపాటు హిట్లర్ వ్యతిరేక పోరాటంలో పాల్గొనవలసి వచ్చింది. ఆలశ్యం చేసిచేసి ప్రజలు సహించలేని స్థితికివచ్చేసరికి రెండవ రంగాన్ని ప్రారంభించి హిట్లర్ ఓటమిని దగ్గరకు తీసుకురావలసివచ్చింది. తాము ఇంతకాలంనుంచి సంరక్షించిన యూరపియన్ ప్రభుత్వాల పై ఖరిని ఖండించాల్సివచ్చింది. ఇండియాలో కాంగ్రెసునాయకులు ఫాసిస్టు అనుకూలురని ప్రపంచానికంతకూ అబద్ధ ప్రచారంగావించిన ప్రభుత్వం గాంధీజీని విడుదల చేయవలసివచ్చింది. ఇవన్నీ ప్రపంచప్రజల విజయాలు. సామ్రాజ్యవాదుల అపజయాలు. ఫాసిస్టులు ఓడినతరువాత తిరిగి తమ పెత్తనాన్ని సాగించుట అసంభవమని వారి అపజయాలే నిరూపిస్తున్నాయి నేటి ప్రపంచ రాజకీయాల్లో ప్రతి నిమిషం ఈ సత్యం మరింత స్పష్టంగా నిరూపించబడుతోంది.

అయినప్పటికీ లండన్‌లో కూర్చున్న పాత ప్రభుత్వాలు (పోలిష్ ప్రభుత్వంలాంటివి) గాని, బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులుగాని తమ యుద్ధానంతర పెత్తనానికి సంబంధించిన ఊహాజనిత ప్లానులను యింకా మానలేదు. ఉదాహరణానికి; పోలిష్ ప్రభుత్వం సోవియట్ వ్యతిరేకత మాని పోలిష్ ప్రజలతో నిలచి, నాజీమూకలతో పోరుటకు ఇంతవరకూ అంగీకరించలేదు. ఈ పోలిష్ ప్రభుత్వ యాజమాన్యంక్రింద 31 పోలిష్ పత్రికలు లండన్‌లో యధాప్రకారంగా సోవియట్ వ్యతిరేక

ప్రచారం గావిస్తూనే ఉన్నాయి. ఈ విషయాన్నిగురించి బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక అయిన 'డెయిలీ వర్కర్' ప్రశ్నిస్తే, బ్రిటిష్ ప్రభుత్వం నుంచి జవాబులేదు. యదార్థ విషయం యేమిటంటే - సోవియట్ ప్రభుత్వాన్ని, ప్రజా ప్రభుత్వాలను ద్వేషించే ముఠాలు యింకా బ్రిటన్, అమెరికాదేశాల్లో పనిచేస్తున్నాయి. వారి అండచూచుకుని ఈ పాత ప్రభుత్వాలు యింకా పాతపాటనే పాడుతున్నాయి. పోలిష్ - సోవియట్ సరిహద్దు 'తగాదా' మొదలైన విషయాలను అదునుగాతీసుకొని ఈ ఫాసిస్టుముఠాలు పెద్ద సోవియట్ వ్యతిరేక ఉద్యమాలను లేవదీయాలని కుట్రలు జేస్తూ ఉన్నాయి. 'బోల్షివిజం యూరపియన్ నాగరికతను నాశనంచేయబోతోంది' అని గోబెల్సు యిచ్చే వినాదాన్ని యీ ముఠాలుతీసుకొని గోబెల్సుతోపాటు వంతపాట పాడుతూ వుంటాయి. కాని వీరి పాటలను వినే విషయం అలావుంచి వీరిని సహించే రోజులుగూడా సమాప్తి అయినాయి.

రెండవరంగం ప్రారంభమయినప్పటినుంచి ప్రపంచ రాజకీయాలు మరీ వేగంగా నడుస్తున్నాయి. రెండవరంగమంటే, పైన చెప్పబడిన ఫాసిస్టుముఠా అన్నింటికి, పోలిష్ ప్రభుత్వానికి ప్రాణసంకటంగా ఉంది. సోవియట్ ప్రభుత్వ ఓటమిని కోరేవారికి అలా ఉండటంలో ఆశ్చర్యం లేదు. కాని రెండవరంగ ప్రారంభంతో 4 సంవత్సరాలనుంచి లోలోపల మరుగుతూ ఉన్న యూరపియన్ ప్రజా ఉద్యమాలు యూరప్ అంతటా ఇంగ్లీష్ కాలువనుంచి పోలిష్ సరిహద్దులవరకూ, బాల్టిక్ సముద్రంనుంచి నల్లసముద్రం వరకూ ఒక్కసారిగా తలయెత్తినాయి. తనకు తోడుగా మిత్రమండలి సైన్యాలు పశ్చిమ యూరప్‌లో దిగేసరికి, రెడ్ఆర్మీ ద్విగుణీకృతోత్సాహంతో ఈ సంవత్సరంగూడా వేసవిదాడిని ప్రారంభించి ఉత్తరాన గూడా పోలిష్ సరిహద్దులవైపు పురోగమించింది. ఫిన్లండు రంగంనుంచి ఫాసిస్టులను ఖాళీచేయుటకు నూతనరంగం ప్రారంభించింది. ఇటలీలో రోముకు ఉత్తరాన 100 మైళ్లు మిత్రమండలి సైన్యాలు ముందుకు వెళ్ళి దక్షిణ జర్మన్ సరిహద్దులను, ఫ్రాన్సును సమీపిస్తున్నాయి. యుగోస్లావ్ గెరిల్లా సైన్యం ఒక్కదెబ్బన నూతనదాడులు ప్రారంభించింది. ఫ్రాన్సులో తిరుగుబాట్లకు అంచనా వేయలేం. యూరప్ అంతా ఒక అగ్నిపర్వతంగా మారింది. అన్నిశక్తులూ మరుగుతున్నాయి. అన్నివైపులనుంచి ప్రజాశక్తులు దట్టంగా అల్లుకొన్నకొలదీ అగ్నిపర్వతం బ్రద్దలై, ప్రజావ్యతిరేకశక్తులను, ఫాసిస్టు శక్తులను నాశనంగావించి చిమ్మివేసే పరిస్థితులువచ్చినాయి.

పశ్చిమంనుంచి మిత్రమండలి సైన్యాలు, తూర్పునుంచి రెడ్‌ఆర్మీ యూరపులో పురోగమించిన ప్రతి అంగుళానికి యూరపియన్‌ప్రజలు లేచి ఫాసిస్టు వ్యతిరేకపోరాటంలో పాల్గొంటూ "మా స్వాతంత్ర్యం సంగతి ?" అనే ప్రశ్న అడుగుచున్నారు. స్వాతంత్ర్యం కొరకు ప్రత్యక్షంగా పోరాడే వారికే స్వాతంత్ర్యం అని సోవియట్ ప్రభుత్వ సమాధానం. ప్రజాస్వాతంత్ర్యాన్ని గుర్తించుటకు ఇష్టంలేని సామ్రాజ్యవాద ప్రభుత్వాలుగూడా బలపడుతున్న ప్రజాశక్తుల వత్తిడికి ఆగలేక ప్రజాస్వాతంత్ర్యాన్ని గుర్తించవలసి వస్తోంది. యూరపియన్‌ప్రజల సహకారంలేకుండా రెండవరంగం ఎలా విజయవంతం కాగలదు ? అని వెనుకనుంచి ఊపిరి ఆడకుండా ఆందోళన చేస్తుంటే, ప్రతిదేశంయొక్క స్వాతంత్ర్యాన్ని గుర్తించవలసిన అవసరం ఏర్పడింది. అంటే రెడ్‌ఆర్మీ తూర్పునుంచి, పశ్చిమంనుంచి మిత్రమండలి సైన్యాలు పురోగమించిన ప్రతిఅంగుళానికి ప్రజల విముక్తి జరుగుతోంది. ఇటలీ, యుగోస్లావియా, గ్రీస్, ఫ్రాన్సు, పోలెండు...........దేశాల్లో విముక్తి ప్రారంభమయింది. యుద్ధకాలంలోనే, యుద్ధం ముందుకు సాగినకొలదీ, ఫాసిస్టులతోపాటు సామ్రాజ్యవాదుల ఆశయాలు భగ్నమవుతూ, యుద్ధం ప్రజా స్వాతంత్ర్యాన్ని గుర్తింప చేస్తోంది. అందువల్లనే ఈ యుద్ధాన్ని ప్రజా స్వాతంత్ర్య యుద్ధం అంటున్నాం.

ఈ ప్రజా స్వాతంత్ర్యయుద్ధంలో పోలెండు స్వాతంత్ర్యం కనుచూపు మేరలో పడిందనుటకు సందేహంలేదు. పోలెండునుంచి నాజీ ఫాసిస్టులు ఖాళీచేయుటతోపాటు, పోలిష్ ఐక్య దేశభక్తుల సంఘం పోలిష్ ప్రజలందరితోగూడిన ప్రజాస్వామ్య ప్రభుత్వం స్థాపించుటకు నిర్ణయించుకుంది. రెడ్‌ఆర్మీ వార్సా పట్టణంలో అడుగుపెట్టిన వెంటనే నూతన పోలిష్ ప్రజా ప్రభుత్వం స్థాపించబడుతుందని పోలిష్ దేశభక్తుల సంఘం ప్రకటించే వుంది. ప్రజాప్రభుత్వం పోలెండు చరిత్రలో ఒక ఘట్టం. నూతన ప్రజా యూరప్‌లోపోలిష్‌ప్రజలు నూతన ప్రజా పోలెండు నిర్మాణానికి ఐక్యమై సిద్ధంగా ఉన్నారు.

* * * *

కాని నూతన ప్రజాపోలెండుయొక్క సరిహద్దులు ఎలా ఉండాలి ? అనే ప్రశ్న అందరినీ ఎదుర్కొంటోంది. ఈ విషయాన్ని పరిశీలించేటప్పుడు కొన్ని ముఖ్య అంశాలను శాంతిని, అభ్యుదయాన్ని కోరేవారందరూ అంగీకరిస్తారు. నూతన ప్రజాపోలెండు నిర్మాణ కార్యక్రమం

1919 లో జరిగిన పొరపాట్లు తిరిగి జరుగకుండా చూడాలి. ఇతర మైనా రిటీ జాతులను పోలెండులోకి బలాత్కారంగా తీసుకునివచ్చి పోలిష్ ప్రభుత్వం ఆధిపత్యంక్రింద ఉంచగూడదు. అదేవిధంగా, పోలెండుకు చెందిన పోలిష్ ప్రజలను ఇతర ప్రభుత్వాల (ఉ॥ జర్మనీ) అధీనంలో లేకుండగా చేయాల్సి ఉంటుంది. అంతేకాదు. పూర్వంనుంచి పోలిష్ప్రజ లకు చెందిన ప్రాంతాలను పోలెండులో కలపాలి. పోలెండుకు చెందిన తూర్పు ప్రష్యా ప్రాంతం జర్మనీ అధీనంలో ఉండుటవల్ల పోలెండుయొక్క భూగోళ ఐక్యత భగ్నమగుటయేగాక, జర్మనీ తూర్పువైపుకు దురాక్రమణ చేయుటకు అవకాశాలు కల్పించుటయే జరిగింది. ఈ యుద్ధానంతరం తిరిగి దురాక్రమణ యుద్ధాలు లేకుండా చేయుటకై పూర్వం జరిగిన పొరపాట్లు తిరిగి జరుగకుండా చూడాలి. ఆర్థిక, భూగోళ జాతీయ ఐక్యతల మీద ఆధారపడిన నిర్మాణం ద్వారా బలమైన స్వతంత్ర ప్రజా పోలెండు సాధ్య పడుతుంది. అటువంటి స్వతంత్ర పోలెండులో, పూర్వంవలె ఫ్యూడల్ విధానంగాక పరిశ్రమాభివృద్ధికి గూడిన ఆధునిక పునర్నిర్మాణ కార్యక్రమం సాధ్యపడి, ఘనమైన సాంప్రదాయాలన్నీ రూపుమాపుటకు వీలగుతుంది.

చారిత్రిక, ఆర్థిక, ప్రాంతీయ, జాతీయ ఐక్యతలను ఆధారం జేసు కుని, పోలిష్ దేశభక్తుల సంఘ పత్రిక అయిన "పోల్స్కావోల్స్కా" నూతన పోలిష్ పరిహద్దులను గురించి కొన్నిసూచనలు ఇచ్చింది. చారిత్రి కంగా పోలెండుకు చెందిన తూర్పుప్రష్యాను, పోమరేనియా, సిలీసియాను తిరిగి పోలెండులో కలపాలని, సోవియట్ భూమికి చెందిన బైలోరష్యా, పశ్చిమ యుక్రెయిన్లను సోవియట్ ప్రాంతంలో తిరిగి కలిపివేయాలని. అలా చేయుటవల్ల బలమైన స్వతంత్రపోలెండు నిర్మించబడగలదని పోల్స్కావోల్స్కా సూచనలు. పోమరేనియా, తూర్పు ప్రష్యాలు ప్రధానంగా వ్యవసాయిక ప్రాంతాలు; కొద్దిపాటి చిన్నపరిశ్రమలు తప్పితే మరేమీ లేవు. రై, బార్లీ, బంగాళాదుంపలు ఉత్పత్తికి, పశుసంపదకు అవకాశా లున్నాయి. 15 వ. శతాబ్దంలో ప్రష్యన్ సామ్రాజ్యవాదులు ఈ ప్రాంతాలను దౌర్జన్యంగా ఆక్రమించినప్పటినుంచి ఈ ప్రాంతాలన్నీ వెనుకబడిన వ్యవ సాయిక ప్రాంతాలుగానే ఉండిపోయినాయి. ముడిసరుకులు ఉత్పత్తికి ఎక్కువ అవకాశాలుగల ఈ ప్రాంతాలు పోలెండు ప్రజల అధీనంలో లేకుండా పోయినాయి. తూర్పు ప్రష్యాను తిరిగి పోలెండులో కలిపివేయుట వల్ల, జర్మన్ దాడి కుట్రలన్నీ శాశ్వతంగా భగ్నం చేయబడి శాంతి ఏర్పడుతుంది. బాల్టిక్ సముద్ర తీరాన పోలిష్ప్రజలకు తావు ఏర్పడగలదు.

కారిడర్ సమస్య శాశ్వతంగా పరిష్కారం అవుతుంది. అయితే 1919 లో తూర్పు ప్రష్యాలో ఉన్న పోలిష్‌ప్రజలు జర్మనీ సరిహద్దులలో ఉండుటకు వోట్ చేసినమాట వాస్తవమే. కాని అలా వోట్ చేయుటకు కారణాలు లేకపోలేదు. పోలెండుకు పోల్చి చూచినయెడల ఆనాడు జర్మనీ బలప్రద మైన పారిశ్రామిక దేశంగా ఉండుటవల్ల పోలిష్‌ప్రజలు ఆకర్షించబడి ఆ విధంగా వోట్ చేశారు. కాని సరిహద్దుల పరిష్కారం అందరికీ తృప్తి కరంగా జరగాలంటే, అటువంటి కారణాలు ప్రధానం కానేరవు. అంతే గాక గతంలో సామ్రాజ్యవాదులు తమ స్వప్రయోజనాలకై లోగడ నిర్ణ యించిన సరిహద్దులు అనేక క్లిష్టసమస్యలకు దారితీసినపుడు, ఆ సరిహద్దుల నన్నిటినీ శాశ్వతంగా భగ్నంచేసి తీరాలి. అందువల్ల తూర్పు ప్రష్యా, సిలీసియా, పోమరేనియా ప్రాంతాలను తిరిగి పోలెండులో కలిపితీరాలి. ఇక బైలోరష్యా, పశ్చిమ యుక్రెయిన్లను సోవియట్ యూనియన్‌లో ఎందుకు చేర్చాలో ఇదివరకే పూర్తిగా చర్చించబడింది.

కాని పోలిష్‌ప్రభుత్వపువైఖరి, పోలెండుయొక్క చారిత్రిక, ఆర్థిక, జాతీయ ఐక్యతలను గుర్తించకుండా చివరికి కర్జన్‌లైనుకు గూడా అంగీ కరించుటలేదు. 1919 లో కర్జెన్ లైనును నిర్ణయించిన పారిస్ మిత్రమం డలి శాంతి సమావేశంలో సోవియట్ ప్రతినిధులు పాల్గొనుటకు నిరాకరించ బడింది. సోవియట్ సరిహద్దుల నిర్ణయ విషయంలో సోవియట్ ప్రతి నిధుల అభిప్రాయాన్ని తీసుకోకుండా కర్జన్‌లైన్ నిర్ణయించబడింది. అయి నప్పటికీ సోవియట్ ప్రభుత్వం, తన అప్పటి బలహీన పరిస్థితినిబట్టి ఆ నిర్ణయానికి అంగీకరించింది. తరువాత పోలిష్ ప్రభుత్వం ఆ లైనును గూడా దాటి సోవియట్ ప్రాంతాలను ఎలా ఆక్రమించిందోగూడా మనం చూశాం. గుర్తించవలసిన విషయమేమిటంటే, ఇప్పుడు పోలిష్ ప్రభుత్వం కర్జన్‌లైనునుగూడా అంగీకరించుటలేదు. కాని పోలిష్ సరిహద్దులను నిర్ణ యించేది లండన్‌లోని పోలిష్ ప్రభుత్వంకాదు. సరిహద్దు ప్రాంతాలలో ఉన్న సోదరప్రజలందరితో స్నేహసంబంధాలను పెంపొందించుకొని శాంతి, స్వాతంత్ర్యంతో అభివృద్ధి అగు ప్రజాపోలెండును నిర్మించుటకు ఐక్యమైన పోలిష్ ప్రజలు పోలెండుయొక్క నూతన సరిహద్దులను న్యాయసమ్మతంగా నిర్ణయించుటకు ముందుకు వస్తున్నారు. ఈనూతన సరిహద్దులలో నిర్మించ బడే నూతన ప్రజాపోలెండు నిర్మాణం దగ్గరిలోకి వచ్చింది. ఈ స్వతంత్ర ప్రజాపోలెండు పోలిష్‌ప్రజల అభ్యుదయానికేగాక, బలమైన ప్రజాయూరప్ నిర్మాణానికిగూడా తోడ్పడగలదు.

